శ్రీరస్తు

# విచిత్రపాదుకాపట్టాభిషేక

# నాటకము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలు తెనుఁగు పండితులగు

జనమంచి శేషాద్రి శర్మచే

రచియింపఁబడి






చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

వావిళ్లప్రెస్సున

ముద్రితము.

---

1920.

మూలంము 7

# పీఠిక.

---

రసికజనాగ్రగణ్యులారా !

ఇక్కాలమున నాటకములు వ్రాయుటయే సులభ మగుపనిగా నేర్పడినది. నాటక మహాయుగ మని యిక్కాలమును జెప్పవచ్చునని కొందఱనుచున్నారు. నాటకమువ్రాయుటయు, దాని స్వారస్యమును గ్రహించుటయు నంత సులభమగు పని కాదు. "నక్కను జూచినవాఁడెల్ల వేఁటకాఁడే" యన్నట్లు నాలుగు పద్యములు నలువదిమాటలు కలిపిన నాటకము కాచాయన్ని యందఱును వ్రాయఁ బూనుటయు ముద్రించుటయుఁ ద్వరగా నమ్ముటయు నిప్పటి యాచారములై యున్నవి. విద్వాంసులాక్షేపింతురేమో యను జంకు తొలఁగినది. నాటకకర్త లేమూలఁ జూచినను దక్కువపక్షము గ్రామమునకు ముగ్గురునలుగు రైనను గనఁబడుచున్నారు. నాటకసభలు లెక్కకు మించినవి. పాటలు లేకున్న నదియొక నాటకమా యను నాక్షేపములుగూడ వెడలుచున్నవి. లక్షణముల ననుసరింపరాదనియుఁ గాలానుసారముగా వ్రాయవలయునేకాని పూర్వపుఁ బద్ధతులు పనికిరా వనియు, నందు రసములేదనియుఁ గూడఁ బల్కుట మెండైనది. నటీసూత్రధారులకుఁ దిలోదకముల విడుచుట సత్సంప్రదాయముగా నున్నది. అట్లు చేసినఁగాని యది నాటకము కాదఁట. నాందీపద్యమునకు నాటకసంబంధము లేకుండ వ్రాయుటయే సదాచారముగ నేర్పడినది. నాటకమునఁ బ్రత్యక్షముగాఁ బ్రదర్శింపఁ దగనివి కనఁబఱచుట మంచిదని యట్లు చేయుట శిష్టాచారమైనది. నాటకశాస్త్రముల నీపాటికి విసరి పాఱవైచుట యుక్త మనునూహ లభివృద్ధి నొందుచున్నవి. ఔరా ! కాలమహిమ !!

ఇట్లున్నను బ్రాచీనలక్షణముల ననుసరించి వ్రాసిన స్వారస్యముగల దనువారు గూడఁ గొందఱు లేకపోలేదు. అట్టివారైనఁ జదువకపోదురా యనుకొనువారుగూడఁ గొందఱు గలరనియే నిశ్చయింపవచ్చును.

నాటకమును వ్రాయుట యిప్పటివారిలోఁ గొందఱనుకొనుచున్నంత సులభకార్యము కాదు. చక్కఁగా నాటకమును వ్రాసి రసమును

జెఱుపక పోషించుట కొంచెము కష్ట మనియే చెప్పక తప్పదు. అవలక్షణ నాటకముల మాట దలంపక నాటకలక్షణము లేనో కొంచెము విమ ర్శింతము.

చతుర్విధై రభినయై స్సాత్త్వికాంగికపూర్వకైః,
ధీరోదాత్తా ద్యవస్థానుకృతి ర్నాట్యం రసాశ్రయమ్.

ప్రతాపరుద్రీయము.

శ్రవ్యప్రబంధములగు భారత భాగవత రామాయణాదులవలెఁగాక దృశ్య ప్రబంధముగాన నాటకము నాట్యప్రధాన మైయుండును. సాంగములగు ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ నిర్వహణము లను నైదుసంధులతోను త్తమ నాయకుని చరితము శృంగార వీరరసములయం దొక్కటి ప్రధానముగాఁ గలది నాటకము. అం దాశీర్నమస్క్రియా వస్తునిర్దేశములలో నొకటిని దెల్పునట్టి ప్రథమపద్యము నాంది యనఁబడును. ఇదియే పూర్వరంగ మునకు ముఖ్యాంగము. కథను నాందీపద్యమునం దర్థముచే నొండె శబ్ద ములచే నొండె సూచింపవలెను. ఆపద్యమునం దెనిమిదిగాని పండ్రెండు గాని పదునెనిమిదిగాని యిరువదిరెండుగాని పదము లుండవలెను.

"సూత్రధారో నటీం బ్రూతే మారిషం వా విదూషకమ్"

అన్నట్లు సూత్రధారుఁడు నటీమారిష విదూషకులయం దొకరితోఁ జేయు సంభాషణ మామఖ మనఁబడును. ప్రస్తావన యనఁగా నిదియే. దీనికిఁ గథోద్ఘాత ప్రవర్తక ప్రయోగాతిశయము లను మూఁడంగములుగలవు. ఉద్ఘాత్యకావలగితప్రపంచాదులు పదుమూఁడంగములు ప్రస్తావనకుఁ గలవుగాని యథావకాశముగా వానిని బ్రయోగించుకొనవచ్చును. ఇట్లు ప్రస్తావనను జక్కఁగాఁ జెప్పి విష్కంభచూళి కాంకాస్య ప్రవేశ కాంకావ తారము లనఁబడు నైదింటిచే నాటకమునందుఁ బ్రదర్శింపఁ దగని కథను సూచించుచు నంకావాంతరకథలను గలుపుచుండవలయు.

"దూరాధ్వానం వధం యుద్ధం రాజ్యం దేశాదివిప్లవం
సంరోధం భోజనం స్నానం సురతం చానులేపనం
అంబరగ్రహణాదీని ప్రత్యక్షాణినినిర్దిశేత్"

అను నీ మొదలగునవి నాటకమునఁ జూపఁదగనివి. ముఖసంధికి ఉపక్షేప పరికరాదులు పండ్రెండంగములును, ప్రతిముఖసంధికి విలాస పరిసర్పవిధూ

తాదులు పదుమూఁడును, గర్భసంధికి అభూతాపహరణ మార్గాదులు పండ్రెండును, విమర్శసంధికి అపవాద సంఫేట విద్రవాదులు పదుమూఁడును, నిర్వహణసంధికి సంధి విబోధ గ్రథనాదులు పదునాలుగు నంగములు కలవు. ఇట్టి యఱువదినాలు గంగములుగల సంధిపంచకమును జూపి, పూర్వోక్త విష్కంభాదులైదింటిచేఁ గథను సంబంధింపఁజేసికొనుచు రచింపఁబడునది సలక్షణనాటకము.

ఇట్టి నాటకలక్షణములఁ బాటింపక స్వేచ్ఛగా వ్రాయఁబడు నాటకమునకుఁ బేరేమో ప్రాజ్ఞులూహించుకొందురుగాక. నాటకమునఁ బ్రదర్శింపఁదగని వధాదు లిపుడు చక్కఁగాఁ జూపఁబడుచునే యున్నవి. అట్టి నాటకముల కొక్కశాస్త్ర మేర్పడుఁగాక.

ఒక్కతఱి నాటక లక్షణములం జదువునప్పుడు తదనుగుణ్యముగా నాటక మొకటి వ్రాయవలయు నని నాకుఁ దోఁచినది. శ్రీమద్రామాయణమునాంధ్రీకరించినవాఁడ నగుట నందే దొకభాగముఁ బైవానికి లక్ష్యముగ రచించిన మేలని తోఁచి విచిత్ర పాదుకాపట్టాభిషేక మను పేర నీనాటకమును వ్రాసితి. ప్రధానకథకు విరుద్ధముగఁ గొలఁది మార్పులు చేయవలసి వచ్చినది. నాటకకర్తల కిట్టి యధికారమును బూర్వులే ప్రసాదించి యున్నారు. ఇంద్రుఁడు గంధర్వనిమూలముగఁ గైకకుఁ బత్రికను జేర్చుటయు, మునివేషమునఁ దానే పాదుకలను సిద్ధపఱచుటయు నిందు ముఖ్యములగు మార్పులు. మఱికొన్నియుఁ గలవు. నాటకాంగముల నందందు గుర్తులు చూపి తల్లక్షణములఁ గ్రింద వివరించితిని. ప్రమాదికాది దోషములున్న మన్నించుటకుఁ బండితవరేణ్యులఁ బ్రార్థించుచున్నాఁడను.

అత్యంత శీఘ్రకాలమున దీనిని ముద్రించి యిచ్చినట్టి యాంధ్రగ్రంథోద్ధారకులకుఁ గీర్తి ధురంధరులకు బహువిధపరోపకారులకు వావిళ్ల - రామస్వామిశాస్త్రి సత్పుత్రులకు శ్రీ వేంకటేశ్వరశాస్త్రి గారికిఁ గృతజ్ఞతాసూచకవందనశతంబు లర్పించుచున్నాఁడను.

1-4-20.

ఇట్లు విన్నవించు పండితపాదసేవకుఁడు,

జనమంచి - శేషాద్రిశర్మ.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.

## పురుషులు.

గణపతిభట్టు, శిష్యుఁడు
దశరథుఁడు
వసిష్ఠుఁడు
మంత్రులు
పౌరులు
వృద్ధబ్రాహ్మణుఁడు
శుభశర్మ
రాముఁడు
దేవశర్మ
సూర్యశర్మ
సుమంత్రుఁడు
బ్రహ్మయ్యశాస్త్రిలు
సునాభుఁడు
సమ్మోహనుఁడు
సుకేశుఁడు
లక్ష్మణుఁడు
భరతుఁడు
శత్రుఘ్నుఁడు
కపటముని

## స్త్రీలు.

కౌసల్య
సుమిత్ర
విలాసిని
పద్మావతి
మంథర
కైక
హంసగమన
పద్మాక్షి
సీత

ఇంకను కొందఱు సమయోచితముగ వత్తురు



శ్రీ ర స్తు

# విచిత్రపాదుకాపట్టాభిషేకము



## నాంది.

చ. సిరి వెలయంగ సాధుజనచిత్తములున్నతమోద మంద ని
ర్జరవరు లౌర యంచు స్తుతిరాజగణంబుల సన్నుతింప ను
[1] ర్వరబహుధర్మసంతతులరాజిలఁ జేయ జనించి చిత్రమౌ
కరణి నటించు రామనృపకాంతుఁడు ప్రోవుత మెల్లభక్తులన్. 1

సూత్ర:—(నాంది యనంతరము దెసలు కలయంజూచి మహానందముతో) మహనీయులగు సభ్యులు రంగస్థలము వేడుకలలరున ట్లింతలోనే యలంకరించినారే.

తే. దెసలయం దెల్లనిండె మద్దెలనినాద
మౌర! వినువారి వీనులకతిముదంబుఁ
[2] గూర్చుచున్న గీతమెంతయుఁ గూర్చె సుఖముఁ
గర్ణములకును మదికి నిక్కముగ నిపుడు. 2

(దోసిలొగ్గి సభవంకకుఁ దిరిగి వినయముట్టిపడుచుండ) రసగ్రహణ పారీణుల రగు నోసభ్యులారా! తమ యనుమతి నొంది యేదేనొక విచిత్ర నాటకమాడఁ దలఁచియున్నాఁడను. తమసెలవేమి ?

(ఆకాశమువంకకుఁ గర్ణమునిడ్చి) ఓహో విచిత్ర పాదుకాపట్టాభిషేకనాటకరాజము నభినయంపు మనెదరా. (సంతోషముతో) నిన్నమొన్న నే.

---

1. ఇరువది రెండు పదములుగల నాంది. కథాసూచనము చక్కఁగా నిందు వ్యంగ్యముగ సూచింపఁబడినది.

2, ఇది రంగ ప్రసాధనమను ప్రస్తావనాంగము.

సీ. ఆంధ్రభూసురకుల♦మందుద్భవం బంది
బ్రహ్మాండ ముఖ్యపు♦రాణరత్న
ముల నాంధ్ర మొనరించి♦వెలసెఁ జనమంచి
శేషాద్రిశర్మ వి♦చిత్రరీతిఁ
గనఁబడియెడు నాట♦కశ్రేష్ఠ మొనరించె
వావిళ్ల సద్వంశ♦వార్ధిశీత
రశ్మినాఁదనరి యాం♦ధ్రగ్రంథములనెల్ల
నభివృద్ధి నొందించి♦యశముగాంచి
తే. సద్గుణాలంకృతుండయి♦సరస చిత్తుఁ
డగుచు నొరులకు నుపకృతి♦నలరిచేయు
వేంకటేశ్వరశాస్త్రి య♦భిమత మెసఁగ
నాదృతిం గోరఁగా వారి♦యాజ్ఞఁబూని. 3

ఏమి నాయదృష్టము! చిరకాలమునుండి యువ్విళ్లూరుచున్న నాకోరిక నేఁటికి ఫలించినది. నేఁడు రసగ్రహణ చతురులగు నీసభాస్తారుల యెదుట నీనాటకరాజము నభినయించి వీరిమనస్సుల రంజిల్లఁ జేసి కృతార్థుఁడనయ్యెద. ఔరా! యిట్లుండవలెఁ గదా యదృష్టము.

క. నిరుపమనవరస బంధుర
[1] తరమీనాటకము సభ్య♦తతియిది విద్యా
పరిపూర్ణము నాట్యంబునఁ
బరినుతిఁ గాంచినది నాదు♦పరివారములన్. 4

(కొంచెము ముందునకునడచి) ఏలయింకను మానటిరాక కాలముపుచ్చుచున్నది. (గట్టిగాఁబిలిచి చూచెద) ఆర్యా! మాటలోనే రమ్ము. అదృష్టము ఫలించినది.

నటి:—(ప్రవేశించి మోమున సుస్మితముచిందులాడ) ఆర్యపుత్రా! మాటసగము లోనే వచ్చితిని. పిలువక ముందే పయనమై వచ్చుచుంటినిగాని తోవలో నొక విచిత్రముకనఁబడఁగాఁ జూచుచుంటిని. కావునఁ బిలువకముందే రాఁజాలనైతిని.

సూత్ర:—తోవలో నీవు జూచిన విచిత్రమేది? నేనును విచిత్రమును జూప నుద్దేశించియే నిన్నుఁబిలిచితిని.

1. ఇది సభాభిముఖీకరణ మగు ప్రరోచనయనంబడు నంగము.

నటి:—(వినుగుతో) అప్పుడే నామాటకు బదు లూహించి పెట్టుకొనియుంటిరా యేమి ?

సూత్ర:—ఆర్యా! అంతవిసుగేల ? నిజముగానే నేను విచిత్రమును జూపనుద్దేశించి యుంటిని.

నటి:—ఏమా విచిత్రము ?

సూత్ర:—నీవు చూచిన చిత్రమును జెప్పుము.

నటి:—సరిసరి మాటలసందడిలో నామాటమఱచి పోవునట్లు చేయుచున్నారా యేమి?

సూత్ర:—ఆర్యా! అట్లూహింపకుము.

నటి:—ఆర్యపుత్రా! అటులైనం జెప్పెద. సపరికరనైవచ్చుచుండఁగా నొక యింట వివాహము జరగుచున్నట్లుండెను. జూడఁగా నట జరగనున్న దానిని భూషణముల విషయమునఁ బేరాసతో నొక జవ్వని యాకార్యము నిలిపి వేసినది. ఇంతకంటెఁ జిత్రమేమి కావలయును?

సూత్ర:—ఆర్యా! నేనుగూడ వనితయొకర్తు లోభమునఁ బరమమంగళకార్యము నొకదానిని నిలిపివేసిన కథనే నాటక మాడఁదలఁచి నిన్నుఁ బిలిచితిని.

నటి:—(కోపముతో) మాటకుమాటఁ గూర్చుటయే గాని యింకొకటి లేదు గదా.

సూత్ర:—ప్రేయసీ! ఇంచుకంతయు నసత్యమించు లేదు. ముందు నీకే తెలియఁగలదు.

నటి:—(సంభ్రమముతో) ఐన నే నిపుడు చేయఁదగిన కృత్య మేదో యాజ్ఞయిండు.

సూత్ర:—బేలా! నీకుఁ దెలియదా కృత్యము.

చ. శిలలు ద్రవింపఁ బాడెదను ♦ జిత్రముగా మఱియాటయందు ని
శ్చలమగు పాండితింగనిన ♦ జాణనటించును బ్రౌఢవాక్కులన్
[1]బలుకుచునుందువింట సఖి ♦ వర్గము చెంగట నేఁడు చూచెదం
జెలియరో నీదుపాండితిని ♦ జేర కనంబడఁ జేయు మీసభన్. 5

నటి:—తమ యనుగ్రహమున్న నట్లే నేర్చుకొలఁదిని నాశక్తిం జూపం బ్రయత్నించెదను. ప్రస్తుతము ప్రయోగింపఁదగు నాటకమేదియో తెలిపి నన్ను ధన్యం జేయుఁడు.

సూత్ర—(పత్రిక యందిచ్చి) ఈనాటకమాడవలయు.

నటి—(పత్రికనుగ్రహించి)

1. నిందాస్తుతిని బ్రియవాక్యములచేఁ జేయుటచేత నిది ఛలమనునంగము.

మ. తనకుం రాజ్యముఁ గూర్పఁగా జననియే ♦ ధాత్రీశునాత్మేశుఁ గో
రిన నాతం డెదలేని ప్రీతిమెయిఁ గో ♦ ర్కిండానిఁ దీర్పంగ భూ
[1] మినిదాఁ బొందక యన్న పాదుకలఁ గూ ♦ ర్మిం దెచ్చి రాజ్యంబు భ
క్తిని జేకూర్చినగాథఁ గాంచఁదగు నీ ♦ తిస్ఫారముం నేఁడిటన్. 6

(అనిపఠించి) ఆర్యపుత్రా! ఈకథయెట్టిదో నాకు స్ఫురింపకున్నది. స్పష్టముగాఁ దెల్పి కృతకృత్యం జేయుఁడు.

సూత్ర—ఓసీ బేలా! ఇట్టికథనే యెఱుంగఁజాలక పోతివిగదా. కైక వరమడుగ దశరథుండు సత్యభీతుఁడై విధిలేక యందులకంగీకరింప శ్రీ రామచంద్రుఁ డరణ్యముల కరుగ భరతుండువచ్చి తల్లిచెప్పినచొప్పున రాజ్యంబుంగొనక తానడవులకుం బోయి బహుభంగుల నన్నం బ్రార్థించి యప్రాప్తలాభుండై దైవలబ్ధ శ్రీరామ పాదుకలను దెచ్చి పట్టాభిషేకముసేసిన కథయని కాదటే దాని యర్థము.

నటి—ఆర్యపుత్రా! అజ్ఞానముచే నడుగఁబూనితిని ఆగ్రహింపక సెలవిండు. దైవలబ్ధమను పదమున కర్థమేమి?

సూత్ర—బేలా! భగవల్లబ్ధపాదుకలని కాదా దానియర్థము.

నటి—ఆయర్థమునకన్న నదృష్టలబ్ధ పాదుకలన్న బాగుండునేమో యని తోచుచున్నది.

సూత్ర—(ఇంచుకయూహించి) ఆర్యా! మిక్కిలిచక్కఁగానున్నది. నీమతిప్రౌఢిమ మెచ్చఁదగినదియే.

[2]నటి—ఈ నామతి ప్రౌఢిమ తమ యనుగ్రహముననే గదా.

సూత్ర—ప్రియురాలా!

క. వినయము విద్యయుఁ గౌరవ
మునుగల నీవంటిరమణి ♦ ముదమునఁ గనునా
కునుసిద్ధింపని కోరిక
యనఁగలదె మహీతలమున ♦ సరసిన నైనన్. 7

[3](అని యొడలుమఱచి కౌఁగిలించుకొని ముద్దిడుకొనఁబోవును).

---

1. గూఢార్థముగా వచించుటచే నిది నాళిక.
2. హాస్యకృన్మిథస్స్తోత్రము చేయుటచే నిది ప్రపంచము.
3. ఆనందపారవశ్యమున నసంగతకృత్యము చేయఁబూనుట దిని యసత్ప్రలాపము.

1నటి—ఆర్యపుత్రా! ఈసుమాంగి సుకుమారురాలు. ఈ గాఢాలింగనాదుల కోర్వ నిష్టపడదు.

సూత్ర—(లజ్జచే మరలుచున్నాఁడు).

2నటి—ఆర్యపుత్రా! తమ రానందపరవశులరై యున్న వారుగాని నాకిట్టి యత్యద్భుత విషయముగల నాటకమాడి సభ్యుల మెప్పింపఁగలనో లేనోయని పెనుభయ మంకురించుచున్నది.

సూత్ర—వెఱ్ఱిదానా! మననాట్యపరికరములన్నియు మనోహరములుఁగ నున్నయవి. ఇఁక భయమున కవకాశ మేమున్నది? నీవుమాత్రము పాటపాడునపు డేమి చేయుదువో చెప్పఁజాలను.

3నటి—ఆర్యపుత్రా! ఆవిషయమున మీకు జంకేల? నేను సభను సంగీతమోహరస ప్రవాహమున ముంచివైచెదను. తమరు శ్రద్ధవహింపుఁడు.

4సూత్ర—ఇదిగో శ్రద్ధవహించుచున్నాను. ఇపుడే ధ్రువ ప్రారంభించుచున్నాను.

నటి—(సస్మితయై) ఆర్యపుత్త్రులిపుడు ధ్రువాగానమును జేయుదురుగాఁబోలు.

5సూత్ర—నామాటఁ జక్కఁగావినకముందే నోరున్నదని తప్పులుపట్టిన నే నేమి చేయఁగలను? ధ్రువయగు నాట్యవిద్యయని నాభావము. ధ్రువాగానము చేయ కుతూహలము నిన్నుఁబురికొల్పుచున్నదేమో. అటులైన నిపుడే ప్రారంభింపుము. పైనచెప్పినమాటను స్థిరపఱచుకొనుము.

నటి—(ధ్రువాగానముచేయఁబూని) ఏఋతువునుగూర్చి పాడమందువో.

సూత్ర—ప్రేయసీ! గ్రీష్మర్తువునే పాడిచూపుము.

•నటి—

క. సరసుల హృదయము లొప్పఁగ
నిరుపమభావద్విజాళి ♦ నెమ్మింగన సుం

---

1. నవ్వుగానాడెడు మోసపుమాటగాన నిది వ్యాహారము.
2. ప్రకృతార్థమును దెలుపుటచే నిది యవలగితము.
3. పోటిచేత నొకరినిమించి యొకరు హెచ్చుగా మాటలాడుటచే నిది యధిబలము.
4. తత్తఱపాటుతో నప్రకృతవిషయమును బల్కుటచే నిది గండము.
5. శృంగారాదిరసములు తోఁచునట్లు చెప్పఁబడినపలుకునకు వేఱుభంగి నర్థముచేయుటచే నిది యవస్యందితము.

దరరీతి నగముఁలలరఁగఁ
బరఁగెఁ గ్రీష్మర్తులక్ష్మి ♦ భానురరీతిన్. 8

సూత్ర—(ఆలకించి పరమానందపరవశుండై) ప్రియురాలా! నీగానమిట్టిదని మున్నెఱుంగనుజుమీ.; ఎల్లప్పుడు వినుచున్ననాకే యిట్లున్నదే. ఇఁకఁ గ్రొత్తగా విను నీసభ్యులకెట్లుండునో. సాధు! సాధు!

నటి—నాథా! ఈపొగడ్తలకేమి? సభ్యులనలరించినతర్వాత మెచ్చినది మెప్పు.

సూత్ర—నిశ్చయమేగాని నీపాట సర్వసరసజనగేయమని నాకిప్పుడేస్ఫురించినది. కావుననే మెచ్చుకొంటిని.

నటి—ఇఁకముందొనరింపఁదగిన కార్యమునకుం గడంగుట లెస్స.

సూత్ర—చక్కఁగా జ్ఞాపకముచేసితివి. ఇదిగో సకల విఘ్ననివారకుండగు గణనాథుని విద్యానాథుని నుతించెద.

చ. జనులెవరెన్ని విఘ్నముల ♦ సాధుపథంబునఁ బొందఁజేసినన్
[1]ఘనకరుణాసమగ్రుఁడయి ♦ కాచి యవిఘ్నముగాఁగఁ గృత్య మె
య్యన జరుగంగఁజేయు కరు♦ణార్ద్రమనస్కుఁడవీవు పార్వతీ
తనయ! మదీయకార్యమును ♦ దప్పకసాగఁగఁజేయు మీయెడన్. 9

(నేపథ్యమున) ఇదిగో వచ్చుచున్నాను. నాతోఁగాఁదగినపని నెఱవేర్చుభారము నూనియున్నాను. ఎవరుగాని నన్నుఁగోరినచోఁ జేయఁజాలినంత సహాయమొనర్చెద.

[2]సూత్ర—ఆర్యా! నేనొనరించిన గణపతిస్తవమును దనదిగాభావించి రాజపురోహితుఁడు వచ్చుచున్నాఁడని తోఁచెడిని. (పురోభాగము నుపలక్షించి) ఇదిగో వీరె గణపతిభట్టుగారు శిష్యసహితముగా వచ్చుచున్నారు. మనము ముందుజరుపఁదగినకృత్యమునకై పోదమురా.

(అని నటీసూత్రధారులు నిష్క్రమించుచున్నారు.)

(ఇది ప్రస్తావము.)

---

1. ప్రవృత్తకాల గుణవర్ణనముచేయుటచే నిది ప్రవృత్తకము.
2. "వీరె"యని నిర్దేశించుట నిది ప్రయోగాతిశయము.



# విచిత్రపాదుకాపట్టాభిషేకము

## ప్రథమాంకము

---

(పిదప రాజపురోహితుఁడు గణపతిభట్టుశిష్యునితోఁ బ్రవేశించును)

గణ—(మహాహర్షముతో) శిష్యా!

చ. చిరతరమైన యాయువును ♦ జెంది మహోన్నత వైభవంబునన్
ధరణినిఁ బ్రోచి దైవకృప ♦ దానవహర్తలఁ బుత్త్రులన్ మనో
హరలసమానరూపుల స♦హాస్యబలాఢ్యులఁ గాంచి సర్వభూ
వరవిభుఁడై యశంబలర ♦ వర్ధిలు జేని నుతింప శక్యమే. 1

శిష్యుఁడు—గురూత్తమా! మీరు సెలవిచ్చినట్లు దశరథుని నుతింప శేషునకైనను శక్యముగాదు. ఇట్టి ప్రభుశిరోమణి యేకాలమందు నున్నట్లు తెలియవచ్చుట లేదు. కనుకనే.

చ. పరశువుఁ దాల్చి క్రూరుఁడయి ♦ పార్థివకానన తీవ్రవహ్నియై
నిరుపమశక్తిఁ గాల్చితగు ♦ నిర్భరవిక్రము జామదగ్నినె
క్కరణినొ మోసపుచ్చి ప్రభు ♦ కార్యములన్నియుఁ జక్కఁ దీర్చె నీ
ధరణిపుఁ డీతనిం బోగడఁ ♦ దానజుఁడైన నలంతి యెట్లగున్. 2

గురు—శిష్యా! పరశురాముని బారినుండి తప్పించుకొనుట యొక గొప్పపనియా, అరిషడ్వర్గము బారినుండి తప్పించుకొన్న మహాత్ముఁడు కావుననే.

చ. దనుజులబాధలోర్చుకొనఁ ♦ దానసమర్థులమంచు దేవతల్
చని సిరిభర్తవేఁడ సుర ♦ సంతతి బాధలడంపబూని తా
జననముగాంచె నీనృపుని♦సద్మమునన్ వనజాక్షుఁడింత క
న్నను దలపోయఁగా నిల న♦నంతమహత్త్వము ధ్గల్గునేరికిన్. 3

శిష్య—బాగుబాగు! తమరు బాగుగా సెలవిచ్చితిరి. సకలచరాచరప్రపంచవిభుండై, నిజమాయావశీకృతసకలదేవదానవయక్షగరుడగంధర్వవిద్యాధరాదిసముదయుండై, యఖండస్వకీయమహిమాదివాకరప్రభావిభాసితదిగ్వితానుండై, యాశ్రితజనమందారభూరుహుండై, దీనబాంధవుండై, తనరు శ్రీమన్నారాయణమూర్తిపుత్త్రుఁడై జన్మించుట సామాన్యపుణ్యలబ్ధభాగ్యమా.

గణ—అబ్బాయీ, నీ వన్నమాట పొగడఁదగినదే. మిక్కిలి చక్కఁగానున్నది. కాని యిట్లు జన్మించుటకుఁగల కారణమెఱుంగుదువా.

శిష్య—స్వామీ! చక్కఁగా నెఱుంగను. తెలిపినఁ గృతార్థునింజేయుఁడు.

గణ—వత్సా! విను.

చ. సురలును దైత్యదానవులు ♦ శూరశిఖామణులైన యక్షులా
యురగులు లోను గాఁగలుగు ♦ నుద్ధతులెవ్వరు చంపకుండఁగా
వరములఁ గొన్న యాదనుజ♦వర్యుని రావణుని౯ వధింపనీ
ధరనవతారమొందె ఫణి♦తల్పుఁడు లోకగురుండు నేర్పునన్. 4

శిష్య—స్వామీ! చక్కఁగా నాకుపదేశమిచ్చితిరి. ధన్యుఁడనైతిని. ఐన నాకొక్క సంశయము మనస్సున బాధించుచున్నది.

గణ—సంశయమేల? చక్కఁగాఁ బ్రశ్నింపుము నీసంశయములందీర్చెద.

శిష్య—మీవంటి మహనీయులు, ఋషికల్పులగుట నెఱుంగుదురేమో కాని సామాన్యజనులెవ్వ రీవార్త నెఱుంగరు. ఇది యిట్లుండ గతంబేమి?

గణ—అబ్బాయీ! విను.

చ. మనుజతనొందినేఁడు రఘు♦మండనుఁడై హరిపుట్టెనంచు మే
దినిగల యెల్లరుందెలియు ♦ తీరగునేని సమస్తకార్యముల్
పనివడిసాగునెట్లు? భగ♦వంతునిరాక నెఱుంగువారె స
జ్జనులితరుల్ తలంతు రొక ♦ చక్కనిమర్త్యునిగా హరి౯ మదిన్. 5

భగవంతుని క్రియాచమత్కృతి విజ్ఞానధనులగు మహనీయులకుందక్క నితరుల కెఱుకపడదు. సామాన్యమనుష్యులంబోలియుండు హరి సమయము తటస్థించినపుడాయాయికార్యముల నవలీలసాధించును. ఆకార్యముల నెఱవేర్చుపద్ధతి నెఱింగిన పిదప నెల్లరు భగవంతుఁడని తెలియఁగలరు. ఈ విషయములను రహస్యములుగ మది నిల్పుకొనఁదగు.

# ప్ర థ మా ం క ము

శిష్యు—గురూత్తమా! కావుననే మీవంటిమహనీయు లామహాత్మునకుం బురోహితు లనంబడుచు నెల్లవేళల నారామచంద్రునిం జూచుచున్నారు: ఆహా! నేఁటికి నాకునుం దెలిసినది. కృతార్థుండనైతిని. తమ యుపదేశముల రహస్యముగ నునిచి కొనియెద.

గణ—వత్సా! ఇంకొక్కమాట.

చ. ఘనుఁడువసిష్ఠమౌని నృపకాంతునియింటఁ బురోహితుండుగా
ననిశము మంత్రిగాఁగఁజెలువందుచునుండుటకేమి హేతువో
యని తలపోయు మాయన మహాత్ముఁడుగావునఁ బంకజాక్షుఁడే
యనుపమసత్కులంబు వెలయంగ జనియించునటంచు నెంచిచే
కొనియెఁ బురోహితత్వమును గొంకక శ్రీశునిఁజూచు కోరికన్.

శిష్యు—(పరమానందముతో) గురువర్యా! చాలబాగున్నది. ఇట్టి మహాత్మునకుఁ గాఁగల శుభకార్యములఁజూచు భాగ్యముగలవారే యదృష్టవంతులు పుణ్యాత్ములు నగుదురు.

గణ—వత్సా! చక్కఁగా స్మృతివచ్చునట్లుచేసితివి. కాఁగలశుభకార్యము లనుటచే నాకెంతయో లాభము గల్గినది.

తే. చేయఁదగుకృత్యములనెల్లఁ జేయుచుండు
శ్రీపతినెనమ్మి యాతండె చెలఁగి తనకు
[1]సాయపడఁజక్రవర్తియై సాధుకీర్తిఁ
గాంచుమనరాజునకు నీడుగలఁడె యెరుఁగను. 7

[2]శిష్యు—స్వామీ, సమంజసముగా సెలవిచ్చితిరి. ఇట్టివాఁడుకాకయున్న నీరాజునకు నిట్టిచక్రవర్తివిఖ్యాతియు భగవదనుగ్రహము ఎట్లు లభించును.?

గణ—వత్సా! నిజమే లోకమునెందఱో పరిపాలించియుండ నిట్టి యసదృశమహావిభూత్యాధిక మీయనకే లభించుటయు, నితరాలభ్యసత్పుత్రులు భగవదంశములే యనఁదగినవారు కలుగుటయుఁ బై మాటను సార్థకముచేయుచున్నవి.

శిష్యు—ఆర్యశిరోమణీ! మన చక్రవర్తిగారు రాజ్యభారమును బూనవలసియున్నా రనియు, నగ్రపుత్త్రుఁడు సకలజనాభిరాముఁడై, సుగుణధాముఁడై, రాజ్యరమా

---

1. కథాబీజమును గార్యకరణరూపమునఁ జెప్పుటచే నిది యుపక్షేపము.
2. పైదానినే విపులముగఁ జెప్పుటచే నిది పరికరము.

భరణక్షముండై వెలయుట నాతనిం బట్టభద్రుఁగా నొనరింపఁదలఁచి యున్నారనియుఁ జెప్పుకొనుచుండఁగా విన్నాఁడను ఇది యథార్థమని యెంచవచ్చునా.

గణ—వత్సా!. లోకులు చెప్పవచ్చును. నీవును వినియుండవచ్చును. ఆకార్య మవశ్యకరణీయమైయుండవచ్చును. జరగినతర్వాతఁగదా మనముసంతోషింప వలయును.

శిష్య—జరుగకయేమి? దీనికడ్డుపెట్టువారెవరు?

గణ—(చెవియొగ్గివిని) నాయనా, మనమేమో మాటలతోఁ గాలముఁ గడపుచున్నాము. అవె వందిమాగధస్తుతిశబ్దములు వినఁబడుచున్నవి. మహారాజుగారిపుడు పేరోలగము చేరినట్లు తెలియుచున్నది. కావున స్వకృత్యము నెఱవేర్పఁ బోవలయురా.

(అని నిష్క్రమించుచున్నారు)

(తరువాత యథామర్యాదగా దశరథుఁడు మంత్రులు పౌరులుప్రవేశించుచున్నారు)

వసిష్ఠుఁడు—(పరమానందముతో) మహామహీపాలకా, తమ పూర్వపుణ్యము సమంచితమగునదియే కావునను, సర్వేశ్వరుండు పురాణపురుషుండు పురుషోత్తముండాదినారాయణుండు నీవిషయమున నత్యంతప్రసన్నుఁడయి యుండుటచేతను గండములుగడచి సుఖముగనుండు సత్సమయము చేకూరినది.

దశ—మునీంద్రా! తమ యాశీర్వచన ప్రభావమే నాయభివృద్ధికిం గారణము. అదియే భగవంతుఁడు నాపైననుగ్రహమునుచు నట్లొనరించెను. కాఁబట్టియే.

సీ. తననామధేయంబు ♦ వినినయంతనె భీతి
భటనాయకులువడఁ ♦ బాఱిపోవఁ
దనదురాకనుగాంచి ♦ ధైర్యముల్ వదలంగ
యోధాగ్రణులుభీతి ♦ నొందిపఱువఁ
దనపరశ్వధధారఁ ♦ గనిగుండెలవియంగ
భూపతుల్ తనువుల ♦ భూమికొసగఁ
దనసింహనాదంబు ♦ విని రాజపుత్రులు
విహ్వలించుచు నసు ♦ వితతివిడువఁ
తే. చండదోర్దండ బలదర్ప ♦ దండితారి
వీరకానన సముదయ ♦ వీతిహోత్రుఁ
డానతామర్త్య సముదయుఁ ♦ డట్టిపరశు
రామునకుఁ జిక్కిబ్రదికి తి ♦ నోమహాత్మ. ౮

# ప్రథమాంకము

వసి:—రాజేంద్రా! మీతపః ప్రభావ సమధికఫలంబు. మీస్తోమములపంటె, మీపెన్నిధానము, మీప్రాగ్జన్మదాన ప్రతిఫలంబు, జగత్కల్యాణంబు, ననియెన్నియేని విధంబుల ననారతంబు నుతింపందగు భవదగ్రపుత్త్రుని శౌర్యసారంబు సాయముగానుండఁ ద్రిలోకంబు లొక్కటియైనను, శతానంద పురందర ప్రభృతిబృందంబు వానికింబెనుప్రాపై నిలిచినను వెనుదీయంబని లేదననిఁకఁ బరశురాముని మాటయేటికి ?

దశ:—మునివర్యా ! ఏమన్నను భయంపడనుగాని పరశురాముఁడన్నమాత్రమున నా ప్రాణములు తల్లడిల్లుచుండును. ఏలన.

చ. తనభుజమందుఁ గ్రొద్దలిని దాల్చి లయాంతకభీకరాకృతిం
గొని శరచాపముల్ వెలయఁ గొంకొక యింతయులేక యొక్కఁడే
జనపతిచిక్కునా పెలుచఁ జంపుదునా యను నాతురంబుపైఁ
గొనఁజనుదెంచు నాద్విజుని ఘోరరణోత్సుకుఁ గాంచి నాఁడఁజూ. 9

వసి:—అంతటి భీకరాకారుండగు పరశురాముండేమి చేయంగలిగె ?

దశ:—మునీంద్రా ! వారు వచ్చుచున్నారని విన్నమాత్రమున నాగుండెలు బ్రద్దలై పోవుచుండును. నేనెంత ధైర్యము తెచ్చుకొన్నను నిలువకుండెను.

వసి:—ఆమీఁద.

దశ:—తమ యాశీఃప్రభావమున నాసమయమున నాకొక్కయుక్తితోఁచుచుండెను.

వసి:—ఏమాయుక్తి ?

దశ:—

చ. కరమునఁ గంకణంబు ముఖకంజమునం దొకవింతఁ దెల్పుచుం
గరము వెలుంగునట్టి తిలకంబును బచ్చనియంబరంబు సుం
దరమగు దేహమందుఁ దగ ధాత్రివిభుం డెవఁ డొప్పునాతనిం
ధరణిసురుం డెఱుంగు మదిఁ దప్పక పెండ్లికుమారుగా మునీ.

వసి:—తలంచి ?

దశ:—ఆరాజకుమారునిపై నెంతదుర్వార క్రోధమున్నను నొకమాఱుకన్నెత్తియైనం జూడక పోవును.

వసి:—సంతోషము అట్లయిన రాజులందఱు పరశురాముని బారిఁబడి మ్రందనేల?

దశ:—ఈనియమ మాతనికింగల దని యందఱెఱుంగరు. కావునఁ బౌరుషమూని వచ్చు నాతనిపై నడరి హుతవహాభీలజ్వాలాజాలంబున కాహుతియగు శలభంబులది పోల్కి పరశువున కాహుతియైరి.

వసి:—ఆవిషయము తమ కెట్లు తెలిసినది.

దశ:—మహర్షిపుంగవా మనసామంతరాజొకఁడు దైవవశంబున నుద్వాహముచేసి కొనుచుండఁగా భార్గవరాముం డేతెంచి పురంబుచొచ్చి రాజగృహంబుకడ కేగి తద్ద్వారభాగంబునఁ గట్టఁబడియున్న పచ్చనితోరణంబును గాంచి యడిగి యది వివాహసమయకల్పిత మగుటం దెలిసి విసిగికొని మఱొకతావునకుం బోయెనఁట ఈవార్త నాకుం దమయాశీఃప్రభావమునఁ దెలియఁగా నాముని పెండ్లికొడుకుం జంపనట్టి నియమముగలవాఁ డని నిశ్చయించియు, నేసమయమున వచ్చునోయని జంకి నిరంతరము పురబహిర్ద్వారమునఁ బచ్చని తోరణమునుగట్టింప నాజ్ఞాపించి మృషయని యాతఁడెఱింగినఁ గొంపమునుఁగు ననుభయంబున నెన్నియో సహస్రంబులు వివాహములు సేసికొంటిని. పలుమాఱులువచ్చియు నాతోరణమును గాంచి పండ్లు పటపటలాడించియుఁ, బురంబుసొరనొల్లక వెడలిపోయెను. కాఁబట్టి బ్రదికియున్నవాఁడఁగాని లేకున్న యము నింట నెప్పుడో ప్రాఁతకాఁపై యుందును.

వసి:—ప్రభుశిరోమణీ! శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులవంటి కుమారులు ఋగ్యజుస్సామాథర్వము లనఁబడునాల్గువేదములం బోలి పుట్టవలసిన యదృష్టము మీకుం గల్గియుండఁగాఁ బరశురాముఁడే కాఁడు లయాంతకుఁడైన నేమిచేయంగలఁడు.

దశ:—మహాత్మా! నాచిన్నారిపసికూనల వేదములతోఁ బోల్చుట తగునా యని యడుగఁజాలకున్నాను. గురువుల తాత్పర్యమేమో.

వసి:—భూపవతంసమా, విశ్వామిత్రమహాముని వచ్చియున్నపుడు కొన్నివిషయములు చెప్పియుంటిని. మఱచితిరి కాఁబోలును. మరలఁదెలిపెద. అవధరింపుఁడు. ఋగ్వేదము దండనీతిని, బ్రయోగోప సంహారములఁ దెలుపును. కాన దానితో శ్రీరామచంద్రునింబోల్చుట నిఖిలదుష్టరాక్షససంహార మీయనకు ముఖ్యమని తెలియఁదగు. యజుర్వేదముతో లక్ష్మణుంబోల్చితి. దానింబట్టి స్వకర్తవ్యము నెఱింగి విధినిషేధముల తత్త్వముం దెలిసికొని ప్రవర్తించుట యతనికి ముఖ్యమని తెలియుము. సామవేదముతో, భరతునింబోల్చితిని. కేవలభక్తిపరవశత్వమును ముఖ్యమని యది తెల్పును. కాఁబట్టి భరతునిపని శ్రీరామచంద్రుని యాజ్ఞానుసారము వర్తించుటయని తెలిసికొనుము. అథర్వణవేదముతో శత్రుఘ్నునింబోల్చితి. భరతుం

కర శత్రుమారణోపాయ మావేదము బోధించును. కాన నామధేయము సార్థక ముగాఁ జేయుట యతనికిం గర్తవ్యమని తెలియఁదగు. ఇదియ నాభావము.

దశ:—పరమానందము. పరమానందము. మహాత్ములవాక్య మమోఘము. అది యట్లే జరగుఁగాక.

1వసి:—అందులకేమి సంశయము. ఎవరికేదికర్తవ్యమో యది వారుచేయుచుందురు. లోకమెల్ల రట్లేచేయవలయు.

దశ:—(స్మరణమభినయించి) మునీశ్వరా! నేఁజేయఁదగినపని నిర్వహింపుమనుటను జక్కఁగా నుపదేశించితిరి?

వసి:—దేశకాలముల తెలంగెఱింగిన మీకు నేబదులు చెప్పవలసిన దేమున్నది?

దశ:—మహాత్మా! నేనును జిరకాలమునుండి యీవిషయమునే తలంచుచున్నాను. ఏక్షణమున రామచంద్రునకు సకలభూలక్ష్మిని జేకూరఁ జేయుదునా యని యువ్విళ్లూరుచున్నాను.

వసి:—మరెందుల కాపనిచేయక నిలిపితిరి?

దశ:—ఇప్పుడే యీభారమంతయు నాచిన్నారి రామచంద్రునిపైఁ బెట్టక కొంతకాలము నేనేభరించి యాతని సుఖానందపరవశునిం జేయ నుద్దేశించి కొంతకాల మూరకుంటిని.

వసి:—ఎంతకాల మిట్లు జరుపుచుండవలయు ననియో తమభావము.

దశ:—నాకీ భారము దుర్భరమని తోఁచువఱకు.

వసి:—మీకింకను దుర్భరమని తోఁచలేదు కాఁబోలు?

దశ:—మునీంద్రా! చిరకాలమునుండి భూభారము దుస్సహమనియే తోఁచుచున్నది. ఒక్కొక్కప్పుడురాజ్యలక్ష్మి యెదుటనిలిచినట్లు కనఁబడును.

2వసి:—ప్రభువుల యభిప్రాయము ననుసరించియుండు రాజ్యలక్ష్మి కిట్టియానందపారవశ్యము శ్లాఘ్యమే.

3దశ:—అట్టి సమయములలో రఘువంశసంభవుల యందలి సంరక్షణము నీదియే యని మనస్సుచేఁ బ్రార్థించుచుందును.

వసి:—అమీఁద?

దశ—అమహాదేవి కొన్నిమాటలు చెప్పినట్లు కూడ వినంబడుచుండును.

---

1. బీజనిష్పత్తిచేనిది పరిన్యాసము. అర్థసంప్రధారణముచేనిది యుక్తి.
2. సుఖాగమముచే నిదిప్రాప్తి. 3. బీజాగమముచే నిదిసమాధానము.

వసి:—ఏమనియో.

దశ:—యుక్తవయస్కుఁడై నీతిశాస్త్రకుశలుఁడై, శూరుఁడై, ప్రజారంజకుఁడై చెన్నారు నీయగ్రపుత్త్రుఁడు తనజన్మము సార్థకమగునట్లు దుష్టనిగ్రహరూపమైన పౌరుషము నెఱపి విశిష్టశిష్టపరిపాలనరూపమైన స్వధర్మము నిర్వహించును గానఁ గొంతకాలమునకు నీవుచేయఁదగు కార్యమును జేయుమనిచెప్పినట్లు స్పష్టముగ వినంబడుచుండును.

1వసి:—కొంతకాలమున కనుటచే విచారము. స్వకృత్యము, నెఱవేర్పుమనుటచే హర్షము, నొక్కమాఱు మనస్సున నుదయించుచున్నవి.

దశ:—ఇట్లు పలుసారులు వచియించి యామె నన్నాడించి పోవుచుండును.

2వసి:—ఆమె యిట్లు చెప్పికూడఁ జాలదినములాయెఁగదా. కనుక మీమనోభావము మంత్రులకును పౌరులకును దెలిపియావలఁజేయవలసిన యభిషేకమహోత్సవము శ్రీరామచంద్రునకుఁ జేయుటమంచిదని నాభావము. ఆమీఁద దేవతలయుద్దేశ్య మెట్లుండునో యట్లు కార్యము నెఱవేఱఁగలదు.

దశ:—మంచిది. మంచిది. మంత్రులందఱు నాచెంతనుండి వినుచునే యున్నవారు. ఇంతకుముందే నేను జెప్పఁగా వినియున్నవారు. వారితాత్పర్యము నే నెఱుంగుదును. ఐననిపుడుకూడఁ దెలుపవలసినదే.

వసి:—(మంత్రుల ప్రక్కకుఁదిరిగి) మంత్రులారా! ప్రభువుగారి యభిప్రాయమును విన్నారు కదా దాని నెఱవేర్పఁ బూనవలయును.

3మంత్రులు:—పరమానందము. రాజుగారి యుద్దేశ్యము తమయభిప్రాయముఁగూడ బాగున్నవి. పౌరులకుం దెలిపి రాజానుమతి నీశుభ కార్యమును వైళంబ సాగింతము.

వసి:—మంత్రివర్యులారా! మీయభిప్రాయముకూడ నా భావములోనే కలియుచున్నది. (అని దశరథునిపైఁ జూడ్కి నిగుడించి) సర్వసమ్మత మగు నీశుభకార్యమున కెవరు సమ్మతింపరు?

4దశ:—ఇఁకఁ బౌరుల కీసువార్త నెఱిఁగించి వారి యనుమతిఁబొందిన పిదపఁ గార్యమునకుం బూనవలసియుండును. కాని (అని యూరకుండును)

---

1. సుఖదుఃఖహేతువుచే నిది విధానము. 2. రహస్యమును వెల్లడిచేయుటచే నిది యుద్భేదము. 3. బీజమున కనుపగు ప్రకృతకార్యము నారంభించుటచేనిది కరణము 4. బీజప్రోత్సాహనముచేనిది భేదము.

వసి:—ఇంక నేమో కొంతయున్నట్లున్నది. తెలుపఁదగునేని దెల్పుఁడు.

దశ:—మీతోఁజెప్పఁదగని విషయమేమియున్నది? సమయమిదికాదని యూరకున్నవాఁడ. ముఖ్యముగా విమర్శింపఁదగిన విషయమేది. రహస్యమంటపమున నాసంగతిని జెప్పువాఁడ. ఇంతలోనిది మనస్సున సరిచేసికొని తెలిపెద. ఆవిచారమును దొలఁగించిన నిఁక నేయడ్డును లేక కార్యము నిర్వహింపఁబడు.

వసి:—"శ్రేయాంసిబహు విఘ్నాని" యన్నట్లు గొప్ప ప్రయత్నమునకు నంతరాయములు పెక్కులుండును. అవియన్నియు నొకరీతిం దొలఁగించుకొని కార్యమును గొనసాగించుట ధీరలక్షణము. కాఁబట్టి ధీరవర్యుడనఁబడు మీరాత్మలో నెంచి చేసినది నిర్విఘ్నముగాఁ గొనసాగుఁగాక ఆమీఁద దేవతల యాశీర్వచన మెట్లో యట్లే జరగఁగలదు.

దశ:—

చ. నిరతము సత్యవాక్కులనె ♦ నెమ్మివచింపుచు శాస్త్రరీతులం
గరము నెఱింగి యోగరతిఁ ♦ గాంచి మహాత్ములనంగఁ బేరుని
ద్ధరణినిగాంచిఖ్యాతిఁదగు♦ధన్యులుమీరు భవత్కృతంబు నె
క్కరణి ఫలింపకుండు? శ్రుతి♦కాండ విదుత్తమ తాపసోత్తమా. 11

వసి:—సర్వజ్ఞులై, చిరకాలము సకలవిధములగు ధర్మముల నెఱింగి రాజ్యముం బ్రోచిన మీకుఁ జెప్పవలసిన దేదియును లేదు. ఐననాయందలి వాత్సల్యమున మీ రడుగుచుందురు. భగవదుద్దేశ్యము, నెఱవేఱక పోదు. మీకేవిషయముననుగూడవిచారము మనుష్య యత్నమున రానేరదు. ఆమీఁద భగవదుద్దేశ్యమేమో మన మెఱుంగము.

దశ:—తమయాశీః ప్రభావమే నాయభివృద్ధికి హేతువు. రేపురహస్య మండపమునఁ గూరుచుండి విషయము నిద్దానిం దెలిపెద. ఆమీఁదఁ గాఁదగినదియగు.

1వసి:—పౌరులయభిప్రాయమును దెలిసికొనియెద. మేమందఱము మరలఁగూడి సంప్రతించుకొందుము అందులకై పనివినియెదము.

(అని వసిష్ఠాదులు నిష్క్రమింతురు)

(ఇది ముఖసంధి.)

---

1. ముఖ సంధి చక్కఁగాఁ జెప్పఁబడియె.

(తెరలోపల)

మ. ధరణీపాలక చంద్రుఁడీతఁడు కృపం దాఁ బూని యుర్వీజనో
త్కరమున్ రంజిలఁజేయుచున్ జగతిఁ జక్కంగాంచెరాజాహ్వయం
బురుతేజంబు నటంచు నీకయిన నిత్యోల్లాసముం బ్రీతిఁ జూ
చురతింబూనెనో యన్నరీతి నరుణాంశుం డొందెఁ బూర్ణాంశుఁడై.
సరిగా నంబరభాగమున్ దశరథ క్ష్మాపాలచూడామణీ. 12

దశ:—(ఆలకించి పౌరులలో నగువారిఁగాంచి) మీరం దఱభీష్టకార్యాచరణమునకై పొండు. నేను నంతఃపురమునకుఁ బోయెదను.

(అని యందఱు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము సంపూర్ణము.

శ్రీరస్తు

# విచిత్రపాదుకాపట్టాభిషేకము

## ద్వితీయాంకము.

---

(తరువాత వృద్ధబ్రాహ్మణుఁడు ప్రవేశించును)

[1]వృద్ధ:—(తనలోఁ దానే సంతోషించుచు) పెక్కుసంవత్సరములనుండి కౌసల్యాదేవి నాశ్రయించియుంటిని. నేఁటికి నావాంఛలన్నియుఁ దీర్చుకొనుకాలము తటస్థించినది. కొలఁది దినములలో శ్రీరామచంద్రునకు యువరాజరాజ్యాభిషేకోత్సవము జరుగఁగల దను కింవదంతి వినఁబడినది. నాభాగ్యము పండినది. నాగృహిణినోములు ఫలించినవి. ఇఁక నచిరకాలమున నాగృహిణిని సర్వాభరణసంశోభితాంగినిఁగాఁ జేసి కన్నులారఁ జూచి సంతోషించెద. ఆహా!

చ. సకలకలాప్రవీణుఁ డయి ♦ సజ్జనసన్నుతసద్గుణాఢ్యుఁ డై
యకలుషచిత్తుఁ డై రిపుల ♦ నందఱ గెల్చి ఘృణాంబురాశిమో
దకలితుఁ డాశ్రితాళ్యవన♦దక్షుఁడు నై యభిషిక్తుఁ డైన జా
నకిపతి వేఁడ ద్రవ్యము ఘ♦నంబుగఁ గైకొనువాఁడఁ బ్రీతితోఁ. 13

తే. వృద్ధుఁ డయ్యెను దశరథుఁ ♦ డింకమీఁద
[2]నన్నుఁ జక్కఁగఁ బోషించు ♦ నరపతి యన
నీతఁడే యని రాము న♦హీనవిభవు
రాజ్యరమ కాంచుచున్నది ♦ రమ్యదృష్టి. 2

తే. సుజనపూజితు శ్రీరాము♦క్షోణిపాలు
నిగ నొనర్చుట చక్కఁగాఁ ♦ దగినపనియె
రాజ్యలక్ష్మియు శ్రీరఘు♦రాము భుజము
నందె వర్తింపఁ గోరుట♦యర్హమిపుడు. 3

---

1. లోపల మధ్యాహ్నమును వర్ణించుటచేఁ గథాభాగము విచ్ఛిన్నముకాఁగా దాని మరలఁ జెప్పుటచే నిది బిందువు. 2. రాజ్యేందిర శ్రీరాము నాదృతిమై వరియిల షించుటను సూచించుట నిది విలాసము.

(కొంచెము ముందు నడచి) ఓహో! ఇదిగో కౌసల్యాదేవి పరిచారకుం డగు శుభవర్మ వచ్చుచున్నాఁడు.

శుభ:—(ప్రవేశించి) వృద్ధభూసురపుంగవా! నమస్కారము.

వృద్ధ:—శుభవర్మయా. చాలదినములాయె నీతో సంభాషింప వీలుపడదాయె. విశేష సంచారముచే బడలితిని.

శుభ:—ఇపుడే యిట్లున్నదే. ఇఁక శ్రీరామచంద్రుని పట్టాభిషేకమహోత్సవము తానున్నది గాన నూర్పులవిడుచుటకైనఁ దమ కవకాశము దొరకదు కాఁబోలు.

వృద్ధ:—(తనలోదాను) నాయూహ నిజమే. మొన్ననిన్న విన్నమాటలన్నియు వాస్తవములే. ఇఁక సంశయింపఁ బనిలేదు. గృహిణిని సకలాభరణభూషితురాలవు గమ్మని దీవింపవచ్చును. (ప్రకాశము) ఏమేమీ! మహాసంతోషవార్తను జెప్పితివి. ఎవరో నిన్నమొన్న గుసగుసలాడుకొనుచుండఁగా వినియుంటినిగాని, చక్కఁగా నమ్మకుంటిని. ఇఁక నమ్మవచ్చును. చిరకాలమునుండి దేవిగారి సౌధము నాశ్రయించి యున్న సంగతి నీకుఁ దెలియనిదియా! పెద్దవాఁడను. సమయమున నేమో తోఁచినంత సాయము చేయవలయు, నాస్థితి నీ వెఱుంగనిదియా.

శుభ:—బాగుబాగు! మీరింత చెప్పవలయునా. దేవిగారికిఁ దమమాట యన్న మిక్కిలి మక్కువ. మీరొకపూట రాకున్న నామెగారి కేమియుఁ దోఁచదు. నా సాయమేల? మీరు నాపై దయ నునుపవలయును.

వృద్ధ:—కాదయ్యా! సర్వదా చెంతనుండువాఁడవు నీవు కాఁబట్టి సమయము ననుసరించి యొక్కొక్కమాట విడుచుచుండవలయు. ఒక్కపుడు కాకున్న నింకొకప్పుడైన నది ఫలింపక మానదు. ఇంతకన్న సుసమయము దొరకదు. పట్టాభిషేకోత్సవము మాట నిశ్చయమే కదా!

[1]శుభ:—ఆర్యా! ఎంతమాత్రము సంశయ మొందవలదు. బహిరంగము గానీయకుము. ప్రయత్నము లేకయున్న నీమాట పుట్టదు. ఇంతకాలమునుండి మనము వింటిమా. శ్రీరామచంద్రుఁడు ప్రాప్తవయస్కుఁడు. సకలవిద్యలయం దారితేరినవాఁడు. అమానుషకృత్యముల నొనర్చి దేవతావినుతిం గాంచిన మహాత్ముఁడు. నారాయణు నంశమువలన జన్మించిన మహాపురుషుఁడు. కావున నిఁక నాయన కీయభిషేకోత్సవము జరగుట కేమిసంశయముగలదు?

---

1. దృష్టనష్టానుసర్పణముచే నిది పరిసర్పము. దీనిచేఁ బ్రతిముఖసంధి ప్రతిపాదితమయ్యె.

వృద్ధ:—సత్యమే. ముందెట్లు జరుగునో మనబోంట్లకెట్లు తెలియును.

శుభ:—తెలిసినట్లే. కానున్నది కాక మానదు. మనయదృష్ట మెప్పుడో యొక్కసారి ఫలింపక మానదు.

వృద్ధ:—శ్రీరామచంద్రుఁ డిపు డేమిచేయుచున్నాఁడు ?

శుభ:—ఆర్యా ! మహోత్సాహముతో మిత్రమండలి గొలువ నాసీనుఁడై యిష్టకథాలాపములం గొంత ప్రొద్దుపుచ్చి తల్లిగారిని సందర్శింపఁ బోయెనని వింటి. ఇఁక నే నిట మసలుట సరిగాదు. త్వరగాఁ బోయి నాకృత్యములందుఁ బ్రమాదం పడక యుండవలయు. సెలవా.

వృద్ధ:—మంచిది నామాట మఱువకుము. నేనును సమయమును జూచివచ్చెద.

(అని యిరువురు నిష్క్రమింతురు)

(ఇది చూళిక)

(సౌధమున రామచంద్రుఁడు కౌసల్యయుఁ బరివారమును ప్రవేశించుచున్నారు)

రాము:—ఆర్యామణీ ! జననీ ! నేఁ డుదయమే దర్శనమునకు రమ్మని యాజ్ఞయైనదని తెలిసినది. జనకాజ్ఞచే నొక రాజకార్యము నిర్వహించుచుండి రాఁజాలక కొంత తడవుచేసి వచ్చితి. క్షమింపవలయు.

కౌస:—నాయనా ! నాపుణ్యములపంటవగు నీయందు క్షమింపఁదగిన యపరాధమేమి గల్గినది. ఒకపూట చూడకున్నను నాకెంతయో కొఱఁతగనుండును. అందులకే నిన్నుఁ బిలిపించితి. నీవొనరించుచున్న పని వింటిని. సర్వదా రాజకార్యభారమగ్నుఁడవై యెప్పు డుందువా యని యువ్విళ్లూరుచున్నానురా కుఱ్ఱా.

రాము:—

చ. జనకుఁడు దుర్భరంబయిన ♦ క్ష్మాభరముం గయిదండమోయుచుం
[1] డ నెలమి మీఱ హాయిగ వి♦డంబనముల్ చెలువారకుండునో
జననిరో యిప్పుడే సరిగ ♦ క్ష్మాభరముం బయిఁ బెట్టుకొంచు నే
పునఁజరియింపనేల ? మది ♦ పూనదు దానిఁగొనంగ నంతయున్.

కౌస:—నాయనా ! నీవన్నమాట కొంతవఱకు నిజమేగాని చిరకాలమునుండి యెన్నియో వ్రతము లుపవాసములుచేసి మనక్లేశము నొంది వార్ధకంబున నున్నదాన. విశ్వామిత్రుఁడు వచ్చినపుడు నామనం బెట్టిపరితాపమునొందెనో యిపుడు వచియింపం జాల. పరశురామునిం గాంచినప్పటివిషయమును జెప్ప నక్కఱయే లేదు. అగర

1 యువరాజపదమునందు నిచ్ఛలేమిఁ జెలుపుట నిడివిదూఱితము.

డము లన్నియుఁ గడచి నిన్న మొన్నగా హాయిగా నిదురించుచున్న దాన. ఈనాఁటికి నీవు నాకన్నులముందఱ భార్యాసహితుఁడవై తిరుగుచుండఁ గాంచి పరమానంద సాగరమున నోలలాడుచున్న దాన. ఇట్టి నేను,

చ. తనువిది యస్థిరంబు గురు♦దర్పుఁడు కాలుఁడు మ్రింగఁ జూచునో
యన్న నెప్పుడో యెఱుంగ, సమ♦యంబునఁగాఁగల కార్యమైన నా
మనము సుఖాబ్ధిఁ దేలును గు♦మారక యీశుభసిద్ధి యైననా
జనిఫలియించు నంచెపుడు ♦ స్వాంతమునం దలపోయు దానఁజూ.

పరివారము:—రామచంద్రా! దేవిగారికోరిక త్వరగా ఫలియించుఁగాక. సకలవిశ్వంభరాభారము భవద్బాహువున నిల్చి వెలయుఁగాక. మీరును దల్లిగారియానతి జవదాఁటక యామెకు హృదయానందమును సమకూర్పఁ బ్రయత్నింపవలయు.

1రాము:—జననిగారి యాజ్ఞానుసారము తప్పక ప్రవర్తిల్లువాఁడ. ఇసుమంతయైన మీఱువాఁడనుగాను.

పరి:—తమరెప్పుడుగాని దేవిగారియానతి మీఱువారు కారనుట స్పష్టమే. ఐనఁ దొందరపడి యిట్లు విన్నవించితిమి.

రాము:—తల్లిగారి యభీష్టము సిద్ధింపకమానదు. ఐన దానికిఁదగినసమయము దేవతల యుద్దేశ్యము ననుసరించి ఫలించును.

పరి:—నేఁటికి మామనస్సులు కుదుటఁబడినవి.

చ. తలలొకవేయిగల్గు ఫణి♦తల్లజుఁ డెంతయుఁ బూన్కి మోయఁగా
బలమును దర్పమొప్ప రవి♦వంశమహీపతు లెల్ల న్యాయమై
చెలఁగెడు రీతిఁదాల్పఁగను ♦ శ్రీలఁ జెలంగెడు భూమికాంత యు
జ్జ్వలమగు నీభుజంబునను ♦ జాలసుఖస్థితి నొందుగావుతక.

2కౌస:—వత్సా! నీకివా క్కెప్పుడు ఫలించునో, ఎపుడు పట్టాభిషిక్తుఁడవై జానకిం గూడివచ్చి నాకు నమస్కరించిన నిన్నుఁ గన్నులారఁ గాంతునో యని వేడుకపడుచున్నాను.

రాము:—తల్లీ! తమయభీష్టము నెఱవేఱునట్లు ద్చటకుఁ దండ్రిగారుగదా యర్హులు.

కౌస:—నాయనా! విశ్వంభరాభారనిర్వహణాసమర్థుండవ య్యు నీతండ్రియింకను నీకేల యప్పని యొప్పఁజెప్పకున్నాఁడో తెలియఁజాలకున్నాను.

---

1 తొలుత నిచ్చయింపని పదమున నిచ్చనదలుటచే నిది శమము.

2 అనురాగహేతు వగు నుపాయముచేఁ జెప్పఁబడుట నిది యుపన్యాసము.

రాము:—

చ. తనయుఁడు దుర్భరంబయిన ♦ ధారణిభారముఁ దాల్చునంత శ
క్తిని గనఁ డింకఁ గొంతపనిఁ ♦ దీరిచి యవ్వల నొప్పఁజెప్ప మే
లని తలపోసి నాపయిఁ గ♦లట్టికృపాతిశయంబునం దనం
తన ధర నేలువాఁ డని మ♦నంబున నెన్నఁదగుఙ్ సతీమణీ.

కౌస:—వత్సా! ఆమాట నిశ్చయమే. కాని మీతండ్రి కామాకులచిత్తుఁడు. విశే
షించి కైకకు లొంగియుండును. కాఁబట్టి,

రాము:—(మాటకడ్డమువచ్చి) ఐననేమి? ఆమెయు నాయం దపరిమితానురాగము
గలది. నన్ను భరతునికన్న నెక్కుడుగాఁ జూచి యాదరించును.

1కౌస—(ఆత్మగతము) ఈసుమారుఁ డేమియుఁ గపటమెఱుఁగఁడు కావున నందఱిని
సమముగాఁ జూచుకొనును. కైక యభిప్రాయ మిట్టిదని యీతనికిం దెలిపి నిర్మల
మనస్సునకుఁ గలఁతపుట్టింపక యూరకుండుట మంచిది. (ప్రకాశము) ఆమాట
నిజమే. కాని సర్వదా ఆమెయింట నుండుటంబట్టి యుక్తకాలమునఁ జేయఁదగిన
కార్యమును జేయఁడని తెల్పితి. ఆమాయలాడి నాయం దనురాగ మునుపకుండ
నెన్నియో కృత్రిమములు పన్ని రాజు మనస్సును త్రిప్పుచుండును.

రాము—తల్లీ! రాజకార్యపరంపరలో మునిఁగి యుండుటచేఁ ద్వరగాఁ బనులన్నియుఁ
జేయ వలనుపడదని చెప్పుట బాగు.

కౌస—నాయనా!

ఉ. ఎన్నఁడుగాని కర్కశము ♦ దెవ్విధినైనను గాక మార్దవం
బన్ని తెఱంగులం గని కృ♦పార్ద్రిమునై తగు నీడుచి త్తమో
2యన్నరొ వెన్నకన్న నన♦యంబు మృదుత్వముఁ గాంచుఁ గాననే
మన్ననఁ గాంచె లోకమున ♦ మానితపండితపాళిచేఁ గడుఙ్.

రాము:—ఎన్నఁడుగాని తండ్రిగారు నాకొఱకుఁ జేయఁదగుకృత్యములలో నాలసిం
పరు సుమీ.

కౌస:—నిజమే కాని నాయదృష్టము ఫలించు పంతమెపుడో యప్పటికిఁగాని వారికొ
పనిచేయు త్వరగలుగదు.

పరి:—ఈశుభకార్యము త్వరలో జరుగఁగలదను గుఱుతులు కనఁబడుచున్నవి.

---

1. ప్రత్యక్షనిష్ఠురవచనముచే నిదివజ్రము.
2. అనురాగప్రదర్శకప్రకృతవర్ణనముచే నిది పుష్పము.

కౌస:—ఆశీర్వాదములు ఫలవంతములైనచో మనయదృష్టమే యనవలయు.

పరి:—దేవీ! నిన్నమంత్రులతో రాజుగారేమో యాలోచించుచుండిరని విన్నాము. ఈవిషయమును గుఱించియే యైయుండును.

కౌస:—సరే. తెలియఁగలదు. రేపోమాపో బయలుపడక మానదుకదా.

ద్వారికుఁడు:—(ప్రవేశించి) జయము జయము యువరాజా! జయము జయముదేవీ! సుమిత్రాదేవిగారు పరివారముతోవచ్చియున్నారు.

కౌస:—త్వరగాఁ బ్రవేశపెట్టుము.

ద్వా:—మహాప్రసాదము. (అని నిష్క్రమించును.)

సుమిత్ర:—(పరివారముతోఁ బ్రవేశించును. రాముఁడామెకు నమస్కరించును. అందఱును గూరుచుందురు)

కౌస:—సోదరీమణీ! ఏమోనీమోము క్రొత్త వింతకాంతిని దెలుపుచున్నది.

సుమి:—విశేషమే కలదు.

కౌస:—విన వేడుకపడుచున్నాను.

సుమి:—అక్కగారూ! మనరామచంద్రునకుఁ బట్టాభిషేకము జరుగఁగలదని యందఱు అనుకొనుచున్నారు.

కౌస:—అందఱు అనుకొనుటయేనా.

సుమి:—నేఁడు నాపరిచారిక పౌరులందఱు ఉల్లాసముతో నేయింటఁజూచినను ఈమాటలే చెప్పుకొనుచుండఁగా వింటినని చెప్పినది. సంతోషము పట్టఁజాలక మీతో నీసువార్తను జెప్పవచ్చితిని.

కౌస:—నెమ్మనంబున నామేలే కోరుచుండునీ కీయానందము యుక్తమే కాని యీసువార్త దృఢపడునో లేదో చెప్పఁజాలను.

సుమి:—పౌరులత్యానందముతో గృహముల నలంకరింప వేడుకపడుచున్నారఁట. వారికి స్పష్టముగాఁ దెలియకున్న నెందుల కట్టియుత్సాహము నొందియుందురు?

కౌస:—సోదరీ! నీమాట వేగముగా ఫలించుఁగాక! (దక్షిణాక్షిబాహుస్పందనము నెంచి తనలో) ఏల యీయాశుభశకునము లిట్లు కలిగినవి? కైక కిది యిష్టముగా నుండదేమో. ఐన భర్తతో నేమైనఁ జెప్పి మాన్పించునేమో, సర్వేశ్వరుఁడు నాపుత్త్రున కాయురారోగ్యభాగ్యములం బ్రసాదించుఁగాక. (ప్రకాశము) ఇతరులెవ్వరు విఘ్నములు గూర్పకయున్నచో మనము స్పష్టముగా నీశుభవార్తను వినఁగలము.

సుమి:— ఈశుభకార్యమున కెవ్వరు విఘ్నమొనర్పఁగలరు? ఎవరట్టి కుమతులుందురు? శత్రువులే లేని రామచంద్రుని శుభమునుజూడ నిచ్ఛయించనివా రీలోకమున నిప్పటికి లేరనుట స్పష్టము. ఇఁక నట్టివారు పుట్టుదురేమో.

కౌస:— (రహస్యముగా) కైక యేమే నత్యంతరము కల్పింపకుండునా. ఈమాట మనస్సులోనే యడంపుము.

సుమి:— ఈ కార్యమునకే యత్యంతరములును గలుగవు. అట్టి గట్టి నమ్మకము నాకున్నది. కులదైవములఁ జక్కఁగాఁ బ్రార్థించుట యిపుడు కర్తవ్యమని నాకుం దోఁచుచున్నది.

సీ. వందారుజనగణ♦మందారుఁడై నత
  బృందారకుం డగు ♦ విష్ణుమూర్తి
కామితప్రదుఁ డయి ♦ కరుణాసముద్రుఁడై
  ముని సన్నుతుం డయి ♦ తనరుశివుఁడు
భక్తకాంక్షావాన♦పరమవ్రతుం డయి
  సంతతానందుఁడౌ ♦ శతధృతియును
త్రిజగత్ప్రభుం డయి ♦ దేవవద్యుం డయి
  భాగ్యోన్నతింగను ♦ వాసవుండు
తే. వాంఛలను దీర్చి యపమృత్యు♦బాధమాన్పి
యాయువొసంగి భాగ్యంబు♦లందఁజేసి
కాచుచుందురు గాక యే♦కర్ణిచె తప్ప
లక్షులం గాచుచుండునో ♦ యట్లు సతము. 9

ఏతరుణమున యువరాజవై భద్రగజంబుపై నధిష్ఠించి శ్వేతాతపత్రంబును, సురుచిరచామరంబులును, జెలువార, వందిమాగధప్రముఖులు వినుతింపఁ, బౌరు లభినందింపఁ, గవీశ్వరులునుతింపఁ, బండితులాశీర్వదింపఁ, బురమునందిరిగి నాకడకరుదెంచిన నిన్నుం గాంతునోయని నామనం బువ్విళ్లూరుచున్నది. నాయనా జరాభారమునమునింగి చిరకాలము వంధ్యయను నపకీర్తిం గాంచి పెద్దలయాశీఃప్రభావంబున, భగవంతుని యనుగ్రహంబున, నాపూర్వజన్మ పుణ్యపరిపాకంబున, నిన్నుంగన్నదాన. సపత్నుల మాటల నవయవంబులు చిల్లులుపోవ నోర్చుకొని నీవుపుట్టినదాదిగా మీతండ్రి కరుణకుం బాత్రురాలనై హాయిగా నున్నదానను. అనుభవించిన కష్టములకును, పడినమాటలకును, జేసిననోములకును, సలిపిన యుపవాసంబులకును, మ్రొక్కిన దేవతలకును, లెక్క—

లేను. నాయన్నా! ఇట్టి నేను నాతనువున నీ మొండి ప్రాణములుండ నీవు పట్టాభిషిక్తుఁడవై రాఁగా నాకోడలు నీప్రక్క నిలుచుండ శ్వేతచ్ఛత్రంబు నీడనున్న నిన్నెన్నఁడు చూతునాయని కులదైవములకు మ్రొక్కుచున్నాను. తండ్రీ! ఎప్పుడు మీరియువురు నాకోరికదీఱ నీ శుభమహోత్సవ మనుభవించివచ్చి నాకు నమస్కరింపఁ గ్రుచ్చియెత్తి ముద్దిడుకొందునా యని కోరుచున్నదాన. నాప్రాణమా, రామా, జగదభిరామా, (అనికన్నీరు విడుచుచున్నది)

రాము:—తల్లీ. తమయాశీః ప్రభావము గలుగ నీకోరిక కొనసాగుటలో నేమిసంశయమున్నది. అచిరకాలములోనే యీ శుభము నాకును, ఈసంతోషము మీకును లభించు ప్రయత్నము జరుగును గాక. ఊరడిల్లుఁ డూరడిల్లుఁడు. (అనినమస్కరించుచున్నాఁడు.)

కౌస:—(గ్రుచ్చియెత్తి ముద్దిడుకొనును. రాముఁ డాసనము నలంకరించును) వత్సా! నీవాక్యము ఫలించుకాలము త్వరలో వచ్చుఁగాక. మీతల్లిసుమిత్రకూడ నీవిషయమునే తెల్పుచు నాకానందమును గూర్చినది. కొంచెము ప్రయత్నము జరుగుచున్నట్లే యూహింపవచ్చును. లేకున్న నెల్లతావుల నీవార్త బయలుపడమగదా. పెద్దలీవిషయమును జక్కఁగాఁ గనుఁగొని ప్రజలకుఁ దెల్పఁ గలరు. ఈశుభవార్త సత్యము గావలయునని కులదైవములం బ్రార్థించెద. నీవును ఇష్టదైవముల నారాధింపుము. సుమిత్రా! నీవుకూడ రామాభ్యుదయహేతువుగ దైవప్రార్థన మొనరింపవలయు.

రాము:—తల్లీ! సెలవిమ్ము. తమయాజ్ఞానుసారము ప్రవర్తించెద.

(అని నిష్క్రమించును.)

(అందఱును యథోచితముగా నిష్క్రమించుచున్నారు.)

1(ఇది ప్రతిముఖసంధి.)

ద్వితీయాంకము

శ్రీ ర స్తు

# విచిత్ర పాదుకాపట్టాభిషేకము

## తృతీయాంకము.



1(పిదప దేవశర్మ సూర్యశర్మ లను నిరువురు బ్రాహ్మణులు ప్రవేశింతురు.)

దేవ:—ఆర్యా! సూర్యశర్మా! శ్రీరామచంద్రుని సద్గుణము లెంత మనోహరములుగా నున్నవి. సకలజనసంస్తుతి నింత త్వరగాఁ బడసినవా రెవరుండిరి? రాజ్యమునకు రాకమునుపే సకలజనరంజకుఁడై తనకు రాఁబోవు రాజశబ్దమును నిపుడే సార్థకము చేసికొనుచున్నాఁడు చూచితివా.

సూర్య:—పండితోత్తమా! కౌసల్యాదేవి యాశీర్వచనములు నేత్రముల ఱెప్పలవలెఁ గాచుచుండఁగా నీమహనీయమూర్తి కేవిషయమునఁ గొఱంత యుండును?

దేవ:—సత్యమే. తల్లిదండ్రులయం దీరామచంద్రునకుం గలభక్తిప్రేమము లింకొకరికిం గలవా?

సీ. జననియే పరదేవి ♦ సర్వధాత్రి యటంచు
నిరతంబుఁ దలపోయు ♦ నిర్మలుండు
జనకుఁడే పరమాత్మ ♦ సర్వకర్త యటంచు
వినయంబు నూహించు ♦ ననఘచిత్తుఁ
డఖిలసజ్జనులే మ♦హాత్ములౌ తనపూజ
కని సతతం బెంచు ♦ ఘనతరుండు
పరదారలెల్లను ♦ భావింపఁ దనకంబ
లేయంచు మదిఁ గాంచు ♦ హితమనీషుఁ

1. లోపల నిర్దేశింపఁబడిన పాత్రములకు మరల నిచటఁ బ్రవేశము గల్గఁజేయుటచే నిది యంకాస్యము.

2. ఆశీర్వచనరూప ముఖబీజమును మరల ననుసరించుటచే గర్భసంధి యారంభింపఁబడియె.

తే. ధీర ! సద్గుణమణిఖని ♦ యఖిలభూమి
భరణదక్షుఁడు కరుణార్ద్రి ♦ భవ్యచిత్తుఁ
డాశ్రితార్తిహారుండు సద్యశముఁ గన్న
మేటి యీరామునకుఁ గల్గు ♦ సాటియెవఁడు. 1

సూర్య:— నీవన్నది సత్యమే. ఇందిసుమంతయు నతిశయోక్తిలేదు. (అని నలుదిక్కులు గలయంజూచి) చూచితివా యీ నగరవాసులందఱు మహానందసాగరంబున నోలలాడుచు

చ. పనులనొనర్పమాని పలు ♦ భంగుల రాముని నే నుతింపుచున్
[1]జను లెవరైనఁ గన్పడిన ♦ క్ష్మాపతి యేమి సభన్ వచించె నొ
క్కనిమున నైనఁ జెప్పి చనఁ ♦ గాఁ దగు మాకు నటంచు నాతురం
బునఁ దమివేఁడుచుం దిరుగఁ ♦ బూనిరి వీథులవెంబడిన్ బళీ. 2

దేవ:— సాధు! సాధు! చక్కఁగా వర్ణించితివి. వీరందఱు రామాభిషేకమహోత్సవ సందర్శనాసక్తమానసులై సర్వకార్యములను మాని యాశుభవార్తాశ్రవణాదరంబు మనంబునఁ బురికొల్పఁ దిరుగుచున్నట్లే యున్నది.

సూర్య:— ఈప్రక్క చూడుము. జనులు పేరోలగంబున జరిగినవార్తల మనవలన విన నుత్సహించుచు నోళ్లు తెఱచుకొని మనల నెగఁజూచుచు, మనమేమో వచింతుమని యువ్విళ్లూరుచున్నారు. మనమచ్చటనుండి వచ్చితిమని వీరికెట్లు తెలిసెనో కడు విచిత్రము. మన మచ్చటివార్తలం దెలిపి వీరియాతురపాటు మాన్పుదమా.

దేవ:— మిత్రమా మన మిప్పుని తప్పక చేయఁదగినదే. ఆలస్య మొనర్చితిమేని వీరికి మహాపకారము గావించినవార మగుదుము.

సూర్య:— ఈమాటనిశ్చయము. ఆతురులకు నిముసమైన నాలస్యము జరిగినఁ గొంపలు మునుఁగును.

దేవ:— ఓపౌరపుంగవులారా ! సభామంటపమున దశరథభూజాని సెలవిచ్చిన పల్కుల సార మిది. అచ్చటి ప్రజలతో నిట్లు చెప్పెను.

చ. జనులను బోషించు శక్తిఁ దగి ♦ సత్వయుతుం డయి వైరి హంతయై
[2]తనరి సమస్తశాస్త్రముల ♦ తత్వ మెఱింగి కృపార్ద్రచిత్తుఁడై

1. ప్రకృతకార్యమున కుపయోగకరమగు ధర్మము నాచరించుటచే నిదిఅభూతాహరణము.

2. యథార్థవిషయమునుగూర్చి చెప్పుటచే నిది మార్గము.

వననిధిరాజువోలె జనవారములందమి నుబ్బజేయు రా
మునకు మదగ్రపుత్త్రునకు భూరముఁగూర్పఁగ నేఁ దలంచితిన్. 3

ప్రజలు:—అమీఁద. అమీఁద.

దేవ:—సభాస్తారులందఱును గరతాళములను జేసి

మ. చిరకాలంబు సమస్తభూభరము నిశ్చింతంబుగాఁ దాల్చి యు
ర్వరయన్ పేరును సార్థకం బయి తగన్ భాసిల్లఁగాఁ జేసి భూ
వర! యెంతే ధృతిగల్గి యిప్పుడు జరాభారంబునం గ్రుంగి శ్రీ
వరు జ్యేష్ఠాత్మజు రాము భూభరముఁ బూన్పం జేయ యుక్తంబెగా. 4

ప్రజలు—అమీఁద జరగిన వార్తలేమి?

దేవ:—త్వరపడక వినుండు. అంతట మంత్రులు లోనగువారు లేచి "సకలకల్యాణ సుగుణధాముం డగు శ్రీరామచంద్రుఁడు యువరాజగుట మాకు మనస్సంతోషము గలుగఁ జేయునని వేయిభంగులఁ దెలుపుకొనుచున్నాము. అదెప్పుడు జరగునో యని త్వరపడుచున్నాము. ఇదమిత్థమని వినఁ గుతూహలపడుచున్నారము"

ప్రజలు—అందులకు రాజుగారిచ్చిన ప్రతివచన మెట్టిది?

దేవ:—"మంత్రులారా! పౌరవృద్ధులారా! మీసంతోషము నాకనంత ప్రమోదము నిచ్చుచున్నది. మఱియుఁ జిరకాలమునుండి యీసర్వసర్వంసహాభారనిర్వహణ శ్రమమున నాభుజంబు లలసియున్నయవి. ఇఁక విశ్రాంతినొందనిచ్ఛయించు నాచిత్తమును వ్యాకులపెట్ట నుత్సహింపను. మీరును నవీనప్రభుత్వము నపేక్షించుచున్నారు. అది యుక్తమే యని నాభావము. శ్రోత్రపదార్థము సర్వజనాపేక్షణీయము కదా. కాఁబట్టి మీయంగీకారము నాకపారసహాయము చేసెను. త్వరలో నిట్టే యొనర్చువాఁడ" ననియె.

ప్రజలు:—నేఁటికి సఫలమనోరథుల మైతిమి. ఇవ్వార్త నెపుడువిందుమాయని తహతహపడుచుంటిమి. నేఁడు నిద్రనుండి లేచినవేళ మంచిది.

సూర్య:—మిత్త్రమా! ఈసద్వార్తను వినవలయునని కౌసల్యాదేవి సపరివారయై కొలువుండి యువ్విళ్లూరుచుండును. కావున మన మచ్చటికి వెళ్లుట యుక్తమే.

1దేవ:—నీవుచెప్పిన యీమాట సమయానుకూలమైనది. సభావిషయము చక్కఁగా స్మరణకుం దెచ్చితివి. మనకంటె ముం దెవ్వరే నామాట నాదేవితోఁ జెప్పక మునుపే మనము వెళ్లుట మంచిది.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

1. ఇది వితర్కప్రతిపాదనవాక్యమగుట రూపము.

(సౌధమున యథోద్దిష్టముగాఁ గౌసల్యసపరివారయై ప్రవేశించుచున్నది.)

కౌస:—సుమంత్రా! నిన్న మేము విన్నట్లు మన శ్రీరామచంద్రునకు శుభమహోత్సవము జరగుట కూహింపఁబడినదని నేఁడు వినవచ్చినది. ఆయుత్సవ మెపుడుజరగునా యనియుఁ, గన్నులార నెప్పుడు కాంతునా యనియు నువ్విళ్లూరుచున్నదాన. నీవును విన్నావుకదా యీశుభవార్త.

సుమం:—మంత్రులును పౌరులును గొప్పసభగాఁ గూడిరనియు, మహారాజుగారు తమయభిప్రాయమును దెల్పిరనియు, నందఱానందపరవశులైరనియు విన్నానుగాని యిదమిత్థమని స్పష్టముగాఁ దెలుపువారు కనఁబడనందున నేనును వినఁ గోరుచునే యున్నాను.

కౌస:—నీవు విన్నంతవఱకుఁ ద్వరలోఁ బట్టాభిషేకమహోత్సవము జరగు ననియే విన్నావు కాదా.

సుమం:—ఇంచుమించుగా నట్లే యనుకొనవచ్చును. (అని పెదవివిఱుచును)

కౌస:—(ఆత్మగతము) సుమంత్రుఁడు పెదవివిఱుచుచున్నాఁడు. ఆసభలో నేమేని విరుద్ధప్రక్రమము జరగినదో యేమో. అట్లుండిన నాకెవ్వరైనం జెప్పకుందురా? కనుఁగొనియెద (ప్రకాశము) ఆర్యా! సుమంత్రా! నీవు విన్నంతలో నీమహోత్సవమునకు విఘ్నములు కలుగవనుట స్పష్టమైనది కదా.

సుమం:—తల్లీ! పదిమంది యొకచోటఁ జేరినపుడు తోఁచినట్లు మాటలాడుచుందురు. ఏదియెట్లున్నను బెక్కుమంది మనపౌరులు త్వరగా నిమ్మహోత్సవమును జూడవలయునని యుత్సాహపూరితాంతఃకరణులై యున్నారనుట తెలియవచ్చినది.

కౌస:—నీమాటలవైఖరిని బట్టిచూడఁగాఁ గొంతమంది విఘ్నకర్తలుఁ గలరని తోఁచెడిని. కట్టా! మనోవాక్కాయకర్మముల నెవ్వరికైనఁ గీడుసేయఁదలంపనైనఁ దలంపనిరాముని మేలు చూడ నోర్వనివా రుందురుకాఁబోలు. ఇఁకసర్వజనప్రియవర్తను లెవ్వరెట్లుందురో!

సుమం:—తల్లీ! తమరాత్మసందియ మందవలదు. చక్కఁగా జరగును. విఘ్నములాడదవని కార్యములుండవు. అవి పొసఁగుటయే కార్యమునకు వన్నెకల్గునట్లగు.

కౌస:—నిశ్చయమేకాని సకలకష్టముల ననుభవించి విసిగియున్నదానఁ గానఁ జీమ చిటుక్కుమన్న నేమోభయము రాఁబోవునని భయమందుదాన. అంతియకాక నాకుఁ బ్రత్యక్షవిరోధమును గనఁబఱచువారున్నారు కాఁబట్టి సంశయ మపుడపుడంకురించును. కాని మనయత్న మేమిసాగును? భగవదుద్దేశ్య మెట్లో యట్లే సెలవ

వేఁచును. సుమంత్రా! ఇంకను శుభవార్తాహరులు రాకయున్నారు. కారణ మేమో!

(దేవశర్మయు సూర్యశర్మయుఁ బ్రవేశించి)

[1]అహా! ఏమి మనయిరువుర యదృష్టము అత్యద్భుతశుభవృత్తాంతమును దేవిగారికిఁ దెలుపుభాగ్యము మనకు లభించినది. మనము చెప్పినమాటలను విని దేవిగారానందసాగరమున నోలలాడుదురు. (అని యోలగమును బ్రవేశించి) దేవిగారికి జయము! జయము!

కౌస:—సుమంత్రా! మన మనుకొనుచున్న ప్రియవార్తలను జెప్పువారా వీరు?

[2]ఇరువురు:—దేవీ! తమకు శుభప్రియవృత్తాంతమును మనవిచేయవచ్చిన దేవసూర్యశర్మనామకుల మగు విప్రులము.

కౌస:—ఓహో! మీరాక హృదయానందమును మాకుఁ గల్గఁజేసినది.

సుమం:—విప్రోత్తములారా! రామప్రియవార్తలను దెల్పి మాకెల్లనానందముఁ గల్గఁ జేయుఁడు.

దేవ:—తల్లీ! శ్రీరామచంద్రుని యువరాజుగాఁ జేయునుద్దేశ్యముతోఁ గూర్చిన మహాసభకు మేమును వెళ్లియుంటిమి.

కౌస:—అచ్చట నేమిజరగినదో చక్కఁగా విన వేడుకయగుచున్నది.

దేవ:—

చ. త్వరపడువారెకాని గుణధాముని రామునిఁ బట్టభద్రునే
క్కరణిని నెప్డుచూతు మను కాంక్షలనుండెడువారె కాని యె
వ్వరును మఱొక్కరీతిఁ గను బల్కెడువారటఁ గానరారు మే
మరసితి మెల్ల భంగులను నమ్మరొ భూపతి యట్లుపల్కఁగా. 5

కౌస:—తరువాత తరువాత.

దేవ:—మంత్రులందఱును సకలకల్యాణగుణధాముని రాము నభిషేకింపుమని తమ సంపూర్ణవాంఛితమును దెల్పిరి.

కౌస:—అమీఁద నేమిజరగినది?

సూర్య:—(మాటఁ దానందుకొని) తల్లీ! పౌరులంగాంచి మహారాజుగారు

---

1. ప్రస్తుతోత్కర్షాభిధానమగు నుదాహరణము.
2. సంచింతితార్థప్రాప్తిచే నిది క్రమము.

చ. తనువు జరాభరంబున నితాంతము చిక్కె శిరోజముల్ తమం
తన దధిపూసినట్లు గసితచ్ఛవిఁ దాల్చె శిరంబు కంపముం
గనియెడు దృష్టిపాటవము క్రన్ననఁ దగ్గెను బుద్ధికౌశలం
బనునదిలేదు గాన నిఁకనాత్మజునిన్ యువరాజుఁ జేసెదన్. 6

అని సెలవిచ్చిరి.

1కౌస:—(సుమంత్రునిజూచి) వీరిరువురకు సంతోషవార్తాకథనమునకు ఫలంబుగాఁ జక్కనిపారితోషికము నిప్పింపుము.

సుమం:—(చిత్తమని పారితోషిక మిప్పించును.)

దేవ:—(పారితోషికప్రదానమునకుం బరితృప్తినొంది) తల్లీ! తమ యౌదార్యము సకలయాచకజనులపాలిటి కల్పవృక్షము సుఁడీ.

కౌస:—అమీఁద జరగిన దేమి?

సూర్య—పౌరులందఱు నేకవాక్యముగ సంతోష ముట్టిపడునట్లు మహారాజు గారి యభీష్టము ననుసరించి శ్రీరామచంద్రున కభిషేక మొనరించిసుంతవిశ్రాంతి నొందుటయు మాకభీష్టమే యనిరి.

కౌస:—తరువాత?

సూర్య:—దశరథమహీపాలుఁ డానందరసాబ్ధి నోలలాడుచు నా ప్రజల యభీష్టము నెఱవేఱును గాక యనియె.

కౌస:—సుమంత్రా! నేఁటికిసువార్త దీనిని వింటిమి. ఇఁకధన్యురాలనైయైతిని. నా మనం బిప్పు డీసద్వార్తను సుమిత్ర మొదలగు వారికిం దెలుపవలయునని త్వరపడుచున్నది.

సుమ:—నేనును బెద్దలకెల్లరకు నీశుభవార్తను దెలుప వెళ్లుచున్నాను.

(అందఱు నిష్క్రమింతురు)

(పిదప దశరథుఁడు వసిష్ఠమునితో రహస్యమండపమునఁ బ్రవేశించుచున్నాఁడు.)

దశ:—వసిష్ఠమునిచంద్రా! సభలో నా నుడివినమాటలు మీరు విన్నారుకదా. ప్రజ లెల్ల రామాభిషేకోత్సవదర్శనకుతూహలులై యున్నారు.

వసి:—కుతూహలము మాత్రమే కలిగియున్నారా ఎప్పు డెప్పుడని త్వరపడుచు నున్నారు. వారియుత్సాహ మనివార్యము.

1. సామదానోక్తిచే నిగ్రహసంగ్రహము.

శా. శ్రీరాముండు క్షితీశుఁడై మహిమముం జెన్నారఁ బాలింపఁగా
భూరిప్రాభవ మొప్ప భూరమణిసంపూర్ణప్రభాయుక్తితోఁ
దా రాజిల్లుచునుండఁ బంక్తిరథుఁ డుత్సాహంబుతోఁ బొంగఁగా
శ్రీ రంజిల్లఁగఁ జూతు మెప్పుడనుచుం జిత్తంబులం దెంచుచున్. 7

క్షణ మొక యేఁడుగా గడపుచున్నారు రాజేంద్రా!

దశ:—నిశ్చయమే నామనంబునం గూడ నట్లే యూహించుచున్నాను.

వసి:—"శుభస్య శీఘ్రి" మ్మనుసూక్తి మీ రెఱుంగనిదియా.

దశ:—మునీంద్రా! త్వరపడవలసినదే గాని, నా చిక్కులు తమకుఁ దెలియనివియా.

వసి:—ఏవిషయమునవో

దశ:—తమకుఁ దెలియని విషయము లేవు. అయినను జెప్పుచున్నాను. నేను సంతానార్థినై కేకయ రాజపుత్రిని బరిణయమాడఁ గోరి యాధరారమణుని యింటికిం జని యతని మన్ననలం బడసి నాయభిప్రాయమును దెలిపితిని. నాయుద్దేశ్యమును విని యారాజచంద్రుండు నన్నుం జూచి

చ. జనవర! నీవు నాతనయ నమ్మికఁ బెండిలియాడ నెంతయున్
మనమునఁ గోరు దేని నొక మాట వచించెద దాని కొప్పినన్
దనయ నొసంగువాఁడను నితంబినికిన్ జనియించుపుత్త్రినిన్
జనపతిఁ జేయఁగావలయుఁ జక్కఁగ నెంచి వచింపు మిష్టమున్. 8

అని పలికెను.

వసి:—ఆమీఁద ?

దశ:—నేను ముదుసలినైనందునను, ముందు వివాహము చేసికొన్న భార్యలయందు సంతానముం బడయకున్న యాశ యించుకంతయు లేనందునను, నీసుదతి యందు సంతానమే లభించు ప్రాప్తముండిన నతఁడు రాజగుట కేయభ్యంతరము గలుగదను నూహ నాకపుడు తోఁచినందునను నొక్కింత యోజించుచుండఁ ద్వరపడి యారాజు నాతో

క. పలికితిని నామనోరథ
మెలమిని నీవట్లు సేయ నిష్టపడితివే
లలనం బరిణయమగు మి
మ్ములఁ జనుమా లేకయున్నఁ బురవరమునకున్. 9

అని స్పష్టముగాఁ బలికెను.

వసి:—అప్పుడు ?

దశ:—ఇఁక నేను మాట యీయకున్నఁ గార్యముతప్పునని యూహించి యట్లేకానిమ్మంటిని.

వసి:—సరే, మీభావము నాకుఁ దెలిసినది. ఇప్పటి ప్రయత్న మామాటకు విరోధము నిక దా?

దశ:—అట్లు గాదు. చేయువిధ మెట్టులోయని.

వసి:—అట్లే కానిమ్మని కదా మీరుచెప్పినది.

దశ:—అవును.

వసి:—దానివలన బాధయేమి ?

దశ:—కేమసఁ దెలియనిదేమున్నది ?

వసి:—రాజేంద్రా ! తమ సంశయమును దీర్చెదఁగాని యవ్వలివృత్తాంతమును జెప్పుఁడు.

దశ:—అంత సకలబంధుమిత్రపరిజనుల సమక్షమున నారాజు నన్నుంజూచి,

చ. జనపతిమీవు భానుకులసత్తముఁ డీతఁ డనంగ సద్యశం
బునుగని యధ్వరంబులనుబూని యొనర్చి తపంబుచేసి చ
క్కనివిధి దానముల్సలిపి క్రాలినవాఁడవు నిక్కువంబుగా
మనమునఁ గల్గువాక్యమును మాకిటఁ దెల్పుము సూనృతంబుగన్.
అని గట్టిగాఁ బ్రశ్నించెను.

వసి:—అందులకు ?

దశ:—

క. నీసుతకు సుతుఁడు కల్గినఁ
జేసెద భూపతిగ నొండు చింతమనమునం
గాసంతయైనఁ జేయకు
మా సత్యము నాదుమాట యని తెలఁపఁ జనున్. 11

అంటిని.

వసి:—(ఇంచుక యోజించి) రాజేంద్రా! కానిమ్ము. నీవాక్కున కసత్యదోషంబులేదు. ఎట్లంటివా. వినుము. వివాహముచేసికొనిన సంతానము గలుగునను నుద్దేశ్యముతోఁ గైకను గైకొంటివి. వారుకోరినరీతి నొప్పుకొంటివి. ఇపు డామాట తప్పిన లోకు

లెత్తింగిన నను(దూఱరా యని సంకోచింపఁ బనిలేదు. నీకువివాహమై చాలకాల మాయెు. సంతానము గలుగదయ్యె. తుదకుఁ బుత్రకామేష్టిచేయ భగవంతుఁడను గ్రహించి పాయస మగ్నిహోత్రునిచే నిప్పించెను. దానినీకు నలువురుకుమారులు గలిగిరి. ఇది దైవలబ్ధసంతానము కదా. కాఁబట్టి నీవపుడన్నమాట ప్రకారము జరపఁ దగినదేదియునులేదు. ఇంతియగాక కౌసల్యకు సంతానముగలిగినను నీ కుమారికకుఁ గలిగినకుమారునకే రాజ్యమిత్తునని పలుకలేదు. జ్యేష్ఠపత్ని దేవేరియనఁ బడును. ఆమెకు సంతానము గలిగినయెడల వానినివదలిపెట్టుట న్యాయవిరుద్ధము. కాఁబట్టి నీచిత్తంబునఁ గలయుత్తలపాటు నడంచుకొని సుస్థిరుండవై యికార్యము జరపుము. ఇదియ నాయుదంతము.

దశ:—మహాత్మా! మీవచనము శాస్త్రసమ్మతము. నాకు నిదిసమ్మతమే. కనుకనే భరతుని శత్రుఘ్నుని తోడిచ్చి మేనమామయింటికిం బంపితి. వాఁడు రాకముందే యికార్యము సాగవలయు.

వసి:—(ఆత్మగతము) ఈరాజునకేమో మనస్సున నొకయాలోచన మున్నట్లున్నది. కనుఁగొనియెద. (ప్రకాశము) రాజేంద్రా! ఇంతలో భరతుఁడు మేనమామం గూడివచ్చి యికార్యమునకు విఘ్నముఁగల్గించిన ?

దశ:—(కోపముతో) 1 యుధాజిత్తువచ్చి యట్టియసందర్భపుమాటలాడినఁబోనిత్తునే. నాయెదుటనిల్చి మాటలాడఁ గలఁడే. అట్టియనుమానము మీకువలదు.

వసి:—(చిఱునవ్వుతో) రాజపుంగవా! మీనిశ్చయ మారయఁగోరి యంటినిగాక నాకనుమానమేమి ?

దశ:—ఈవిషయము సామాన్యజనులెఱుఁగరు. భరతునితల్లియు నపుడు వినియుండు నని నేనమ్మఁజాల.

వసి:—ఇతరు లెవరేని వినియుండి యామెకుఁజెప్పిన ?

దశ:—మహాత్మా! ఆవిషయమున నించుకయనుమానము నాకునుగలదు. కావుననే త్వరలోముహూర్తము సిద్ధముచేయుఁడని మనవిచేయుచున్నాఁడను. మఱియొక విషయమును జెప్పమఱచితిని. వినుండు. కైకయింటఁ బెక్కండ్రు పరిచారికలు గలరు. వార్గందఱు కేకయరాజొసఁగినవారలే. వారిలో నెవతుకకైన నీసంగతి తెలిసియుండెనా చిక్కుపచ్చును. కనుకనేఁగదా యనవరత మాయింటనున్నవారి నెల్ల సన్మానించుచుందును.

1. రోషసంభ్రమవచనమగుటు నిది తోటకము.

వసి:—రాజేంద్రా! ఇన్నిచిక్కులలో మీమనస్సు తగిలియున్నదే. ఎట్లు కార్యము నిర్వహించి మాట నిల్పుకొనఁగలరు ?

[1] దశ:—మునీంద్రా! అప్పుడు కేకయరాజుచే వంచింపఁబడితిని. ఇపుడు కైకచే వంచింపఁబడుదునేమో యనియే విచారించుచున్నాఁడ.

వసి:—ఇన్నిశంకల కవకాశ మిచ్చినచో మనస్సున స్థిరత్వ మెట్లుపొడుకొనును ?

దశ:—మహాత్మా! తమ యాశీర్వచనప్రభావము నాదండనుండ నెన్నిచిక్కులుగల్గినను గార్యము కొనసాగుననియే నానమ్మకము. (అని యించుక మోమువంచియుండును.)

వసి:—

చ. జనవర! యేమొకో మది వి♦చారము పూనినయట్లు లున్నవా
రనితరసాధ్యకృత్యముల ♦ నన్నివిధంబులఁ దీర్చుశక్తియుఁ
జననమునుండియే కలిగెఁ ♦ జక్కఁగ నిప్పుడు చింతఁ బూన నే
పనియును దీర్పఁగాదు గద ♦ పట్టినపట్టును మానుటొప్పునే. 12

దశ:—మునీంద్రా! మఱొకసంగతియు మనవిచేయవలయునని స్మృతిగల్గినది. కొలఁది రాత్రులనుండి యనేకభంగుల దుస్స్వప్నములగుచున్నవి. ఇట్లెన్నఁడును గల్గినది లేదు. ఆవిషయము మనోధైర్యమును వదలఁగొట్టుచున్నది.

వసి:—

చ. కలలు నిజంబు లెట్లగును? ♦ గల్లలుగావె విచారమేల? యి
మ్ములఁ బరమాత్ముఁ గొల్చుపనిఁ ♦ బూనిన మీ కవి యేవిధంబునన్
ఫలము నొసంగఁ జాలు మదిఁ ♦ బాయని చింతను బూన కింక ని
స్తులమగు సద్వ్రతంబునకుఁ ♦ దోడనె పూనుము నిండుఁగోరికన్. 13

భూపాలమౌళీ! ఏశంకాతంకములు మనస్సునం బొడకొల్పక పరమేశ్వరు మనస్సుననిడి యికార్యమునకుఁ బ్రయత్నింపుఁడు. తర్వాతిపని సర్వేశ్వరునిది. మన పని నెఱవేర్చుట మనపని.

దశ:—ఆజ్ఞయొనరింతును. రామచంద్రుఁడు యువరాజు గావలెనని ప్రజ లువ్విళ్లూరుచున్నారు. మీయిష్టము నట్లేయున్నది. మంత్రులందఱును బ్రజాభిప్రాయము నెఱవేర్చుట యుక్తమనుచున్నారు. ఎప్పు డెప్పు డాయుత్సవముఁ గన్నులారఁ జూతునాయని నామనస్సు త్వరపడుచున్నది కాని యొకప్రక్కన సంశయములు నన్నాకులపెట్టుచున్నవి.

1. ఇష్టజనాతిసంధాన మగుట నిది యధిబలము.

వసి:—ఇంత యిట్లు కోరుచుండఁగా సర్వేశ్వరుఁడు కరుణానీరరాశి యగుట నీకార్యంబును గొనసాగించునని నమ్మి ప్రయత్నింపుఁడు. "భవితవ్యంభవత్యేవ" యన్న మాట సత్యముగదా.

దశ:—మునీంద్రా! 1 శ్రీరామచంద్రుని యభిప్రాయమునుగనుఁగొనవలదా, ఇంకను గొంతకాల మేకష్టములంబొందక స్వేచ్ఛగా నుండవలయుననితాత్పర్యమా, లేక యువరాజు గావలయుననియిష్టమా, యని యడిగి తరువాతఁ బ్రయత్న మొనరింతము.

వసి:—2 ఇది సర్వోత్తమమగుకార్యము. చక్కనియాలోచనము చేసితిరి. తప్పక యిప్పుడే యీకార్యము చేయవలయును. సకలజనసమ్మతుండగు రాముఁడువచ్చి మీయానతి యువరాజపదము నొందుఁగాక.

దశ:—సుమంత్రుని బిలిపింపుఁడు.

వసి:—(ద్వారికునింబిలిచి) వేవేగ సుమంత్రుని దోడ్కొనిరమ్ము.

ద్వా:—చిత్తము. (అని నిష్క్రమించును.)

(పిదపసుమంత్రుఁడు ప్రవేశించును.)

సుమం:—జయము జయము చక్రవర్తిగారికి.

దశ!—సుమంత్రా! కూరుచుండుము.

(సుమంత్రుఁడు నిర్దిష్టాసనమునఁ గూరుచుండును)

వసి:—బుద్ధిమదగ్రగణ్యా! సత్వరముగా రామచంద్రుని రథారూఢునిఁ జేసి తోడితెమ్ము. రాజాజ్ఞ యని తెల్పుము.

సుమం:—మునీంద్రా! అట్లేయొనరింతును. (అని నిష్క్రమించును)

(తరువాత శ్రీరామచంద్రుఁడు సుమంత్రునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

రామ:—జనకా! తమకుమారుఁడు రాముఁ డిదెనమస్కరించుచున్నాఁడు. మునివర్యా! ఇవె నమస్కారములు.

దశరథ వసిష్ఠులు:—రామచంద్రా! వత్సా! చిరంజీవివై సకలరాజ్యరమా ధురంధరుఁడవు గమ్ము.

వసి:—వత్సా! ఇందుఁ గూరుచుండుము.

---

1. ఇదిప్రాప్త్యాశ.
2. ఇది పతాక.

(రాముఁడు యథార్థపీఠమునఁ గూరుచుండును)

దశ:—నాయనా! నిన్నిటకుం బిలిపించుటకుం గలకారణములఁ జెప్పెద విను. విని యట్టిట్లనక నాకోరికను దీర్పుము.

రాము:—తండ్రియాజ్ఞ శిరసావహించెద.

దశ:—

సీ. సకలవిప్రామరుల్ ♦సంతసంబంద న
ధ్వరములఁ జేసిన♦వాఁడఁ బూని
దిగ్దంతివరసంత♦తిని జేరి మూర్తి కా
దినిఖిలవస్తువుల్ ♦దెచ్చినాఁడ
భూపాలకులనెల్లఁ ♦ బోరున నోడించి
దాసభూతులుగాఁగఁ♦ జేసినాఁడ
ధారుణీచక్రిక♦భారంబు లీలమై
నిల్పితి భుజముల♦నిశ్చలముగ
సకలసుఖములఁ బొందితి♦శౌర్యమహిమ
దేవతలు మించువేడ్కను♦దెంప నింత
కాలమేలితి రాజ్యంబు♦చాలునింక
ననుచుఁదోఁచెను నామది♦కనుఁగుఁబుత్ర. 14

మఱియు.

చ. కరము పరాక్రమంబు వెలుఁ♦గఁగ సురవైరులఁ దాఁకి సాయక
స్ఫురదురుశక్తిఁ గాంచి సుర♦పూజ్యులు సంతసమంది యౌరా బళీ
ధరణిపులందు నీతఁడె ని♦తాంతమహోజ్జ్వలతేజుఁడంచు నం
బరమునునుండియే నుతులు♦బాగుగఁ జేయఁ జెలంగినాఁడఁ జూ. 15

ఇంతియగాక. దుర్వారగర్వంబున విఱ్ఱవీఁగు రాజలోకంబు నవార్యశౌర్యంబునం జెండి పాదాక్రాంతులం గావించితి. దిగ్విజయంబొనర్చు కుతూహలంబున నెన్నియోపర్యాయములు బయలువెడలి రణభేరికాధ్వనుల దిక్కులనించితిం గాని యొక్కఁడైనను మాఱ్కొని నిలుపఁ బ్రయత్నమునైనఁ జేయమింజేసి తిరిగితిరిగి యయోధ్యంజేరితి. వర్ణాశ్రమధర్మంబుల సుంతయేనిఁ గొఱఁతపడకుండం గాచితి. రాజనీతినెఱింగి పూర్వాచారంబు తప్పకుండ నింతదనుకఁ బ్రవర్తించితి. సకలసుఖములనుభవించి సంతృప్తినొందియున్నవాఁడ. ఇఁక నీమహీభారంబు మోవఁబూననిమన

స్సుతో నున్నవాఁడ. అఱువదివేలేండ్లు నిండినవి. నాలుగెక్కువయేగాని తక్కువ యుండవు. ఇంకెంతకాలము దుర్వారోర్వీభారంబు వహింతును? చిరకాలము తపస్సులెన్నియో యొనరించి కులోద్ధారకుని, సుగుణగణమాన్యుని, పరాక్రమధన్యుని, ఆశ్రితశరణ్యుని, నిన్ను జ్యేష్ఠపుత్త్రునిగాఁ బడసితిని. ఇంక నాకే విషయములందును గొఱంత లేదు. సకలమనోరథములు నిన్నుఁగన్నప్పుడే నిండినవి. ఇంక మీఁద నీవు.

ఉ. పూనుము రాజ్యభారమును♦బొంకముగా సుజనుల్ నుతింప నెం
దేని యశస్సు డిందువడ♦కే చెలువారఁగ రాజ్యమేలుమీ
సూనులఁగాంచి యన్వయము♦శోభిలఁ జేయుము మమ్మునెల్ల నిం
పూనఁగఁ జేయవయ్య సుగు♦ణోత్తమ యోరఘువంశభూషణా. 16

ఇంకొక్కమాట వినుము.

చ. [1]ధరణిఁగలట్టి యెల్లరుని♦తాంతసుఖోన్నతిఁ జెందునట్లు కా
వరమున భూధవుల్ ప్రజల♦బాధలు పొందఁగఁ జేయకుండ ను
ర్వర తననామ మర్థయుతి ♦ భాసిలుచుండఁగ నొప్పురీతి నో
వరసుత! యేలవయ్య గుణ♦వర్యుఁ డితండనుఖ్యాతి నొందుచున్. 17

ఇది త్రికరణశుద్ధిగా నేఁజెప్పినమాట యనినమ్ముము.

ఇపుడు నీవు.

తే. కొంత కాలమిట్లు కుదురుగా నుండెద
మీరు రాజ్యమేల♦మిగులసుఖము
లొందుచుండ ననుచు♦నోపుత్ర పల్కకు
జనకునాజ్ఞ దాఁటఁ♦జనదుగాన. 18

వత్సా! రామచంద్రా! ఎల్లుండియే పుష్యనక్షత్రము. నీకుఁ దారాబలముగలదని పెద్దలువచించిరి. నాయాజ్ఞ నిసుమంతయు దాఁటక యింతదనుకఁ బ్రవర్తించినట్లే యిపుడు నీవిషయమున బదులుపల్కక యంగీకరింపుము. ఇంతత్వర యేల? బంధువ్రాతమంతయుఁ గూడునట్టులు వేఱొకముహూర్తము నిశ్చయింపరాదాయనకుము. వినుము.

ఉ. కాలమునాకు దుష్టమయి♦కన్పడుచున్నది పెక్కుమాట లిం
కేల మదాజ్ఞఁ బూనుటయె♦యిత్తఱిఁ గృత్యము నీకు విఘ్నముల్

---

1. గర్భబీజసముద్భేదమగు నాక్షేపము.

చాలఁ గల్గు బాగునను♦జక్కఁగనెంచియె పల్కినాఁడ నో
బాలక యింక మాఱునుడి ♦ పల్కక నాపలు కాదరింపుమా. 19

నాముద్దులకుమారా! నిన్నుఁ గన్నప్పటినుండియు నేవిచారము లొందక యుంన్నాను గాన నిత్తఱి నీమహోత్సవముం గన్నులంజూచునదృష్టము నాకుం గల్పింపుము. (అనికౌఁగిలించుకొనును.)

రాము:—తండ్రీ! తమయాజ్ఞ నతిక్రమించువాఁడఁ గానని యెఱింగియు నింతదూర మేల చెప్పవలయు. ఎట్టియిక్కట్టులు సంభవించునట్టిదైనను దమయానతి మీఱువాఁడనుగాను. ఇఁక నిట్టిశుభకృత్యమున నేలయింకొకమాట పల్కుదును. తమ కెద్దిహితమో నాకదియే పరమసమ్మతము. మీకేది యహితమో నాకదియే సర్వవిధముల నసమ్మతము. మీపాదములయాన మీమాట నేనెప్పటికిని దాఁటి ప్రవర్తించువాఁడఁ గాను. విచారమిట్లు తమరుపూననేల?

దశ:—ప్రియతనయా! రామచంద్రా! నీవే మెఱుఁగవు నాయనా, సకలవిధశ్రమముల ననుభవించినవాఁడఁగాన నేనింతత్వరపడుచున్నాఁడ. ఆవిషయముల నిపుడు నీకుం దెలియపఱచుట యనవసరము. నిర్విచారమనస్కుఁడవుగా నీవుండుట నాయిష్టము. ఈవిషయ మింకను వెలిఁబుచ్చకు. రేపు నేనేయందఱకుఁ దెలియఁజేసెద. సమాహితాత్ముఁడవై కులదైవములం బ్రార్థింపుము. తల్లితోడను బత్నితోడను ముచ్చటింపుము. తల్లియాశిషములం బొందుము. ఇఁక నీవువెళ్లవచ్చును. (అనికౌఁగిలించుకొని యానందబాష్పముల విడుచును.)

రాము:—తమయాజ్ఞ శిరసావహించెద (అనినిష్క్రమించును.)

దశ:—మునీంద్రా! ఇఁక మీరభిషేకమునకు వలయుసంభారముల సిద్ధముచేసికొనుఁడు. నేనును దత్ప్రయత్నమున నుండెదను. సుమంత్రా. పురము సకలవిధశృంగారములతో నలంకరింపుఁడని పౌరులకుఁ దెలియునట్లు చాటంబంపుము. మంత్రులుమొదలగువారు తమతమకృత్యములయందే శ్రద్ధపూని యుండవలయు. ఎల్లుండియే శుభముహూర్తమని మునీంద్రులు వచించిరి. ఇఁక నాలస్యము చేయరాదు. సర్వజనసమ్మతమగుకార్యమున నేల జాగునేయవలయు?

(తెరలో)

సీ. మదదంతిదంతయు♦గ్మములందుఁ గ్రీడించి
శారదాదేవితో♦సరసమాడి
మల్లికాసత్సుమ♦మంజులతకునవ్వి
శరదబ్జబింబంబుఁ♦జప్పరించి

# తృ తీ యా ం క ము

దిక్కామినీమణి ♦ దివ్యాంగచందన
పంకంబుపై దమిఁ ♦ బాదమూని
పంకజలతికను ♦ బలుమాఱులు హాసించి
యంచలపించును ♦ ద్యుమణిమాన్పి
యెందుఁదన కుద్దినేనని ♦ యెసఁగుచున్న
వస్తువునుగాన కోభూప ♦ వరకిరీట
రత్ననీరాజనాంచిత ♦ రమ్యపాద
భవ్యతావకసత్కీర్తి ♦ పరిఢవిల్లు.

(అందఱు నిష్క్రమింతురు)

1(గర్భసంధి)

ఇది తృతీయాంకము.

శ్రీరస్తు

# విచిత్రపాదుకాపట్టాభిషేకము

## చతుర్థాంకము



(విలాసియను నొకచేటి ప్రవేశించుచున్నది.)

విలా:—(ఆత్మగతము) దివాణములలోఁ బనిచేసిపనిచేసి విసుగెత్తినది. ఎన్నాళ్లుపని చేసినను బహుమతి దొరకుటలేదు. ఏపల్లెనుండియో వచ్చి యీయయోధ్యలోఁ గాపురమున్నదాన. ముసలిదాననగుచున్నాను. ఇన్నాళ్లకుగా ఇపుడేమో గొప్ప తిరుణాళ్లవంటి సంబరము జరగునంట. నాకును బహుమతి దొరకవచ్చును. రాణులనందఱి నాశ్రయించి నాదేహము దారపోసి కొలువుచేసితిని. ఆపనియీపనియనక యన్నిపనులుచేసితిని. చేతులు కాయలుకాచినవి. నేఁటికేమో సంబరము జరగుననుకొనుచున్నారు. ఇన్నాళ్లుపడినశ్రమమునకుఫలము నాకుఁ గలుగవచ్చును. (దూరమునకుఁ జూడ్కి నిగుడించి) ఎవరో అంతఃపురమునుండి వచ్చుచున్నట్లున్నది. (చక్కఁగాఁజూచి కొంచెముముందునడచి) ఆహా! నాసావాసగత్తె పద్మావతి వచ్చుచున్నది. (అనిముందునకునడచును.)

పద్మా:—(ప్రవేశించి) అక్కయ్యా! విలాసినీ! చూచినావా ఊరిశృంగారము. రెండుకన్నులుచాలలేదే.

విలా:—నిజమే, ఏకాలమున నిట్టియలంకారము చూడలేదు. నేఁడేమో అకస్మాత్తుగా అలంకరించుచున్నారు. ఏయింటను బందిళ్లే, తోరణాలే, ముగ్గులే, అబ్బా! నాలుగుకన్నులున్న బాగుండునేమో చూడడానికి.

పద్మా:—అక్కయ్యా! యీయలంకార మెందుకో నీకుఁదెలిసినదా.

విలా:—బాగా తెలియదు గాని యేదోరాజుగారు తిరుణాళ్లచేయింతురని విన్నాను.

పద్మా:—ఓసి వెఱ్ఱిదానా! తిరుణాళ్లయేమిటి? పల్లెటూరి మోటుతనమింకను నీకుఁ బోలేదే.

విలా:—వెఱ్ఱిదాననే అక్కా! అదేమిటో నాకుఁజెప్పుము.

పద్మా:—శ్రీరామునకుఁ బట్టాభిషేకమఁట. (అని చెవిలో) ఈసంగతియెవరితోను జెప్పకు. మళ్లా తెలుస్తుందిలే.

విలా:—(రహస్యముగా) రామునకా తిరుణాళ్ల.

పద్మా:—ఓసిచెవిటిదానా! తిరుణాళ్లగాదు పట్టాభిషేకము.

విలా:—ఆమాటరాక తిరుణాళ్లంటిని. రామునకేనా. అబ్బా! ఇంక చీరలు రవికెలు గాజులు అన్ని మనకు దొరకును. తిన్నంతతిండి.

పద్మా:—అక్కా! నాపై దయయుంచవుగా.

విలా:—నాదేమున్నదక్కా.

పద్మా:—నీవు కౌసల్యాదేవియింట నున్న దానవుకదా.

విలా:—నీవునుసుమిత్రాదేవియింటనుండలేదా.

పద్మా:—ఉన్నానుగాని మీ యమ్మగారియింటగదా వేడుకలెక్కువ. ఆసందడిలో నన్ను మఱచిపోవవుగదా!

విలా:—ఏమిటో యీవేళాకోళాలు నాకుఁదెలియవు.

పద్మా:—హాస్యాలుకావక్కా! నిజముగా ఈయుత్సవమంతా మీఁదే. మీయమ్మగారితోఁ జెప్పి నాకు బహుమతి యిప్పించవలయును.

విలా:—మా రామునకు రాజ్యముదొరికితే మీలక్ష్మణునకు దొరకదుగా.

పద్మా:—అక్కయ్యా! అట్లుగాదు. నామాటను జక్కఁగా జ్ఞాపకముంచుకొనుమా.

విలా:—ఆమాటలుంచనీ! ఎపుడు మా రాముఁడు రాజగును?

పద్మా:—పెద్దరాజుగా రాసంగతి తీర్మానించుచున్నారఁట.

విలా:—భరతుఁ డూరలేఁడుకాదా.

పద్మా:—భరతుఁడువచ్చువఱకు నిలుపుదురో లేకజరపుదురో?

విలా:—దశరథ రాజు భరతుఁడు రాకున్న నింత యుత్సవము చేయించునంత మొనగాఁడా?

పద్మా:—కాకేమి?

విలా:—కైకయింటికింబోయి యీమాటచెప్పిన నామె తనకొడుకులేనిదే యీమాట యొప్పుకొనునా.

పద్మా:—1(ఏమోఆలోచించి) ఆఁ. జ్ఞాపకమువచ్చినది. త్వరలో రాజు రామునకుఁ

---

1. స్నేహావశముచేత నియతాప్తిప్రదర్శనమూలముగా బీజము నిందుఁ గూడ విమర్శింపటంబట్టి విమర్శసంధి యారంభింపఁబడియె. దోషముల వెల్లడిచేయుటచే నిది యపవాదము.

పట్టము కట్టుటకు రాజు నిశ్చయించినాఁడఁట. కైకమాటలను లోఁబడెనఁట. భరతుఁ డూరనున్నను లేకున్నను ఈకార్యము అతివేగముగా జరగునఁట. కౌసల్య యిష్టమే నెఱవేఱునఁట. రాత్రి యీమాటలెవరో యనుకొనుచుండఁగా విన్నాను. ఆలస్యములేక రామమూర్తి రాజయి సింహాసనమెక్కుటను నీవు చూడఁగలవు. అంతఃపురము నలంకరించుచుండఁగాఁ గన్నులపండువుగాఁజూడక వచ్చినావేమి ?

విలా:—అంతఃపురములో కొందఱిప్పుడే జరగదని కొందఱు జరగునని యొకరికిఁ దోఁచినట్లు వారనుకొనుచుండఁగా విన్నాను. కొంతసేపక్కడనే నిలువఁబడియుంటిని. త్వరగవచ్చువారెవ్వరు నాకుఁ గానరాలేదు. కాఁబట్టి యెపుడో తెలియకవచ్చితిని.

పద్మా:—ఓసి వెఱ్ఱిదానా! నీకుఁ దెలియలేదేమో కాని సకలవిధశృంగారములతో నంతఃపురమును ముచ్చటగా నలంకరించుచున్నారు.

విలా:—ఏమేమో పనులుచేయుచుండిరి. ఆసొబ్బయేమిటో నాకుఁ దెలియలేదు. అయితే కైకయిందులకు సరేయన్నతర్వాతఁ గదా యుత్సవము.

పద్మా:—(ఆలకించి) అక్కా! రేపే ఆయుత్సవమఁట. అదిగో అందఱనుకొనుచున్నారు. మనముకన్నులారఁ జూడవచ్చును. అయినను వారియొద్దకుంబోయి యడుగుదము రా.

(అని యిద్దఱు నిష్క్రమింతురు)

(ఇది ప్రవేశకము)

---

(తరువాత మంథర ప్రవేశించుచున్నది.)

మంథర:—ఏమబ్బా! అయోధ్య క్రొత్తగా నున్నట్లున్నది? ఎన్నఁడు లేని వేడుకలు నేఁడు కనఁబడుచున్నవి. కారణమేమో తెలియరాలేదు. ఇంకఁ గొంతసేపటికైనను నాకుఁ దెలియదా. అప్పటికిని దెలియకున్న మాయమ్మగారి నడిగెద. ఆమెగారికిఁ దెలియక చీమచిటుక్కుమనికూడ ననదుకదా. దేవతోత్సవమా ? ప్రతియింటిముందఱను రంభాస్తంభములు కట్టుచున్నారే. పూలతోరణములు వ్రేలాడుచున్నవే. ఏమబ్బా! యీశృంగారము. (చూడ్కి నిగుడించి) వారో మాయింటికిఁ బ్రతిదినమువచ్చు బ్రహ్మయశాస్త్రులుగారు వచ్చుచున్నారు. అడిగి కనుఁగొనియెద.

బ్రహ్మ:—(ప్రవేశించి) ఇదిగో మంథరగా నున్నట్లున్నది ? అమ్మగారింట నేమిచేయుచున్నారు ?

మంథ:—(ఆతురతతో) అమాటచెప్పెదనుగాని యేమండీ యీపట్టణమంతయుఁ గ్రొత్తగానున్నట్లున్నది ? ఏమేమో చేయుచున్నారే. ఏమి యీపనులుచేయుటకుం గారణము ?

బ్రహ్మ:—

సీ. అరఁటికంబంబుల♦నందంబుగాఁ గట్టు
చున్నారు ముంగిళ్ల♦నొక్క మొగిసి
బూలతోరణములఁ♦బొలుపొందఁ బందిరు
లకుఁ గట్టుచున్నారు♦లలితరీతి
మంచిమామిడిచెట్ల♦మండల నందందు
వేయుచునున్నారు♦వ్రేలునట్లు
పండ్లగుత్తుల నొక్క♦భంగిఁ గై సేయుచు
నున్నారుముందఱ♦సన్నుతముగ
ముత్తియమ్ములతో నేల♦ముగ్గులిడుచుఁ
గుంకుమము చల్లుచున్నారు♦కొనరుమిగుల
నేమిచెప్పుదు మంథరా♦యీపురంబు
కాపురంబయ్యె లక్ష్మి క♦క్కజముగాఁగ. 1

మంథ:—ఈసుద్దులు నాకెందుకయ్యా! ఇట్లుశృంగారించుటకుం గారణమేమి?
బ్రహ్మ:—మంథరా! నిజముగా నీకుఁదెలియకయే యడుగుచున్నావా?
మంథ:—మఱి యేమనుకొన్నారు?
బ్రహ్మ:—ఆలాగా! చెప్పెద వినుము.

చ. తనసుతులందు జ్యేష్ఠుఁడయి♦ధర్మవిదుండయి సద్గుణాఢ్యుఁడై
జనహితవర్తనుండయి వి♦శాలయశంబున మించి శక్యమే
ధను విది వంపనన్న రజ♦తక్షితిభృద్వరగేహచాపముం
గొని యవలీల వంచి ధరఁ♦గోవిదవర్యుఁ డనం బ్రసిద్ధుఁడై. 2

సీ. పెద్దలఁ బొడఁగన్నఁ♦బ్రియములే పల్కుచు
వారియాశిషముల♦వరుసఁ గొనుచుఁ
బరదారలను గన్న♦భక్తిచే జనయిత్రిఁ
గన్నట్టిచాడ్కిచేఁ♦గనుఁగొనుచును
బీదలఁ గన్నచో♦సాదరోక్తులుపల్కి
వారికాంక్షలఁ దీర్చు♦భంగిఁ గనుచు
సేవకతతిఁ గన్నఁ♦జిత్తంబునం బట్టి
యట్లు భావించి యి♦ష్టార్థ మిడుచుఁ

దాపములఁ బాపు చంద్రువిధమునవెల్ల
వారిఁగృపఁ గాంచుచుర్వ భూమిఁబరిఢవిల్లు
రామచంద్రుని వీరమూర్తిన్యు నిప్పుడు
చేయుచున్నాఁడు యువరాజుఁగాతిప్పుఁ దలిప. 2

మంథ:—ఏమీ! రాముఁడు యువరాజగునా? ఎప్పుడు?

బ్రహ్మ:— రేపుమాపు.

మంథ:—(సాసూయ) వింతలోని వింతగనున్నది? ఎవ్వరికిని దెలియనిదే యింత పనియా.

బ్రహ్మ:—మంథరా! పౌరులతో నాలోచించియే యికార్యమునకుం బూనెను.

మంథ:— రేపు జరగుననునమ్మకము మీకున్నదా.

బ్రహ్మ —సంశయమేమి?

మంథ:—మంచిది. కన్నులారఁ జూచెదనుగాక. మీరు రేపు మాదేవిగారిదర్శనమునకు వత్తురుగదా. వృత్తాంతములన్నియు విశదములగు.

బ్రహ్మ:— రేపువచ్చి దేవేరిని దర్శించెద. మహోత్సవసమయము కనిపెట్టియున్నవాఁడ. సమయముదొరకిన నొకమాట అమ్మగారితోఁ జెప్పుము. నీమాటయే చెల్లునుగదా!

మంథ:— నామాటలు చెల్లుకాలమా యిది? చూచెదను. వేళయైనది. కైకేయి నాకొఱకు వేచియుండును.

(అనియిరువురు నిష్క్రమింతురు)

---

(ఏకాంతమునఁ గైక ప్రవేశించును.)

కైక:—(తనలో)భరతుఁడు మేనమామయింటికింబోయి చాలదినములాయె. కుశల వార్తయుఁ బంపలేదు. హాయిగా కూరుచున్నాఁడేకాని తల్లిచిత్త మెంత యుత్తల పాటొందునోయని యెంచి తాను రాఁగూడదా. కుశలవార్తనైనఁ బంపఁగూడదా. పెక్కుసారు లిట్టియుత్తలపాటు నాకే కలుగుచున్నది. కౌసల్య కిట్టి యుత్తలపాటు కలుగదు. రామచంద్రుఁ డెపుడును జెంతనే యుండు. కోడలు సేవింప నిండువేడుకనున్నది.

(చిడిముడిపాటుతో మంథర ప్రవేశించును)

కై:—(మంథరనుజూచి) మంథరా. ఏమి పరుగున వచ్చుచున్నావు? గూనిదానవై నను జరాభారబాధితురాలవై ననుఁ జిన్నదానవనిపించుకొందమనియా యీవేగిరపాటు? సెబాసు! చిన్నదాననిరయే తలంచెద. అందఱితోఁ జెప్పెదనులే. (మొగము

నై పుచూచి) ఏల నీమోము క్రో[1]ధఘూర్ణితమైయున్నది ? ఎవరివలన నీకిట్టి యాగ్ర హము కల్గినది ! నీవిట్లుండుట నేనెన్నఁడును జూచి యెఱుంగనుజుమీ, నేఁడిది క్రొత్తవికారమా, గూనికిఁదోఁడు నీమోము కూడ నిట్లు వికారముగనున్నచోఁ జెప్పవలసినదేమి ? కవీశ్వరులు వర్ణింపఁజాలరు కాఁబోలు ?

మంథ:—(బిగ్గఱగా) ఇంకను నాతో సరసములాడెదవా. కొంప మునుఁగుచున్నది. ఏమీ తెలియనిదానవు.

కైక:—(ఉలికిపడి) మంథరా ! ఏమి ? ఏమి ? ఏమి ? ఎన్నఁడు గాని యప్రియ వార్తను జెప్పనిదానవు. ఏమిట్లు చెప్పుచున్నావు. త్వరగా నంతయు వివరింపుము.

మంథ:—ఇంకను నీకుఁ దెలియలేదా. నీసుఖములు నీటిపాలైనవి. నీసంపదయేటి పాలైనది. నీసంతోషమరణ్యముల పాలైనది.

కైక:—(తోఁచక యూరకుండును.)

మంథ:—పురుషుల నమ్మరాదని నెత్తినోరుపెట్టుకొని యెన్నిపర్యాయములు వాపోయినను వినకపోతివి.

కైక:—చెలీ ! త్వరగా వార్తను జెప్పుమా. నామనస్సు కొట్టుకొనుచున్నది. దిక్కులు తెలియరాకున్నవి. ఎదుటనున్న నీవుకూడఁ జక్కఁగాఁ గనుఁగొనరాకున్నావు.

మంథ:—నేఁడుగా దిట్టులగుట రేపు.

కైక:—నాకర్థము కాలేదు మంథరా. చెప్పవే. నన్నేల కష్టపెట్టెదవు ?

మంథ:—కష్టపెట్టుదానను నేనా ముఁదున్నది ముసళ్లపండుగ. చక్కఁగ శృంగారించుకొని కూరుచుండుము. త్వరలోఁ జీపురుకట్ట చేతికివచ్చును.

కైక:—మంథరా! నీమాటలు నాకర్థము కాలేదు. త్వరగాఁ జెప్పెదవా లేదా? ఇఁకఁ దడవుసేసిన నేమిచేసెదనో చూడు.

మంథ:—కైకా ! ఇఁక నేమిచేసెదవు ! నాయంతదాన వగుదువు.

కైక:—ఇఁకనిముసమైన సైరింపఁజాల. చెప్పకున్న బ్రదుకనుజుమీ ?

మంథ:—ఏమనిచెప్పుదును ? నోరాడకున్నది.

కైక:—దైవమా. ఏమిమాట వినునట్లుచేసెదవో ! మంథరా త్వరగాఁ జెప్పెదవా? ఇంకను దడవుచేసి నాప్రాణములు పోవునట్లుచేసి యీపుణ్యము కట్టుకొందువా?

మంథ:—అట్టిపనికి నేఁబూనకొందునా పుణ్యాత్ములు వేఱుగానున్నారు.

కైక:—నాప్రాణనాథునకుం గుశలమేకదా? భరతుఁడు కుశలియేనా?

మంథ:—నాప్రాణఘాతుకునకుం గుశలమా యనియడుగుము.

1. క్రోధసంభాషణమగుట సంకేతము.

కైక:—మంథరా! నీవేమడిగిన నిచ్చెద. రాజ్యములోఁ గొంతభాగమైన నప్పించెద. నన్నేల యేడిపించెదవు? వార్తనుజెప్పుమా.

మంథ:—ఏమివార్తను జెప్పుమనియెదవు? నోరాడకున్నది.

కైక:—(కన్నీరు విడుచుచు) మంథరా! ఏమే యిట్లనుచున్నావు. ఉరిపోసికొని చత్తునా? నాకేమియుఁ దోఁచకున్నది. ఇఁక నాలస్యముచేసిన నన్నుఁజంపు కొన్నట్లే.

మంథ:—రేపు కౌసల్యకొడుకునకు రామునకుఁ బట్టాభిషేకమఁట. ఇఁక నీవు రేపు మధ్యాహ్నమునుండి కౌసల్యకు దాసివి కావలయు. నాగతి యధోగతియే.

కైక:—(సంతోషముతో నవ్వుచుఁ దనలో) నామేలుకోరినదిది. కాఁబట్టియే శ్రీరాముని పట్టాభిషేక మనుమాట నోర్వఁజాలక యిట్లనుచున్నది. ఈ బుద్ధి మాన్పెద. (ప్రకాశము) ఇదిగో మంథరా! మౌక్తికహారము. (అని మెడలోని హారమును దీసి మంథర మెడలో వేయును.)

మంథ:—[1](క్రోధముతో నెగిరిపడిహారమువలంబౌఁజవైచి) కైకా! త్వరలో నీకుఁ గారాగృహప్రాప్తియో, లేక బలవన్మరణమో సిద్ధముగనున్నది. ఎఱుఁగక సంతోషపడుచున్నావు. (అని కన్నీరునించును.)

కైక:—(చిఱునవ్వుతో) మంథరా! నీవు కేవలము వెఱ్ఱిదానవు. లోకజ్ఞానము నీకు శూన్యము. నీవుచెప్పినది కేవలము శుభవార్త కాఁబట్టి యీహారమున నిన్నలంకరించితి. తెలియక నాకేమో హానిసంభవింపఁబోవునని భ్రమించి పాఱవైచితివి (అనిమరలహారమును మెడలో వేయును)

మంథ:— (హారమును దూరముగా విసరివైచి) కైకా! నీకేమియుఁ దెలియలేదే. నీగతియుం దేమియని యేడ్చునన్ను మఱింతగా నేడ్పించెదవు.

కైక:—మంథరా! త్వరపడకుము. చక్కఁగా విచారించియే మాటచెప్పవలయు. ఇంతచింత నీకేల?

మంథ:—నావిచారమా. ఇంతకాలము నీపంచనున్నందులకు?

కైక:—ఇపుడేమివచ్చినది?

మంథ:—(బిగ్గఱగా) ఇంకను దెలియకయున్నావే. నీసవతియొద్ద నీచపుఁబనులు చేయునపుడు నన్నుతలంచుదువులే.

కైక:—సంబంధములేని మాట లేలపల్కెదవు? రామచంద్రునకుఁ బట్టాభిషేకమనిక దా చెప్పితివి?

---

1. బంధనము చెప్పుటచే నిది విద్రవము.

మంథ:—ఆపట్టాభిషేకమే నీకెన్నియో కష్టములు తేనున్నది.

కైక:—ముత్యాలహారమును ముందుధరించి మరలమాట్లాడును.

మంథ:—(తిరస్కారముతో) అయ్యో! ఎంతవెఱ్ఱిదానవమ్మా! రానున్న కష్టములను తెలిసికొనఁజాలకున్నావే. అదృష్టహీనురాలవు.

కైక:—మంథరా? మొన్న నేగదా వసిష్ఠమహామునిచంద్రులు దయచేసి సకలసౌభాగ్యములుగలుగునట్లాశీర్వదించిరి నీవెఱుఁగవా.

మంథ:—[1](సానూయ) వసిష్ఠునిమాటలు నీళ్లమూటలు. ఎవరిదగ్గఱ వారిమాటలు.

కైక:—[2]పెద్దల నట్లనరాదు. వారితో విరోధించుట మేలుగాదు.

మంథ:—[3]నాయొడలు నీమాటలచే మండుచున్నది. నాకధికారమిచ్చిన నదిగో యీ కరవాలముచేఁ జేయఁదగిన కార్యమొనర్తును.

కైక:—ఓసీ! ఏలా, ఇట్లనుచున్నావేమి?

మంథ!—నాదుఃఖము నీకేమియుఁ దెలియలేదు.

కైక—ఆమాట లటుండనీ. ఒక్కమాటవినుము. మనరామచంద్రుఁడు ప్రభువైన భరతుఁడు రాజయినట్లే. కౌసల్యకన్న నన్నెక్కువగాఁ బూజించుచుండును.

తే. చెలియ యిక్ష్వాకువావిగా క్షితిపు లెల్ల
[4]నీధరారమఁ బూని రవిహీనతేజ
మలర నీనాఁటి కట్టిరాజ్యరమఁ బూను
రామచంద్రుండు సద్గుణ రాజితుండు. 4

నాముద్దులపట్టియగు రామచంద్రుఁడు రాజ్యమూనియుండ నిఁక నాకేమి కొఱఁత. ఇప్పటికి వేయిమడుంగులు నాకధికారము మించునని నమ్ముము.

మంథ!—[5](చేతులుపిసికికొనుచు) అయ్యో నాతల్లీ! ఇట్టిదుర్బుద్ధి నీకేలపుట్టెనో దైవమునకే యెఱుక. పిడుగు మీఁదఁ బడనుండఁగా మేఘుని నుతించినట్లున్నదే. ఇఁక నేమందును? నేనూరకుందమన్నను నానోరూరకుండనీయదు. (అని తర్జని నాడించుచు) ఇంకనైన నీప్రసంగముచాలించి నామాటలనాలకింపవమ్మా. ఏల కష్టముల పాలయ్యెదవు.

1. గురుతిరస్కారరూపమగు ద్రవము.
2. విరోధశమనమగుట నిది శక్తి.
3. తర్జనోద్వేజనములు చెప్పఁబడుటచే నిది ద్యుతి.
4. గురుకీర్తనము చేయుటచేనిది ప్రసంగము.
5. అసూయారూపమగుట చలనము.

కైక:—[1](తనలో) ఇది యోర్వఁజాలక యేమో ప్రేలుచున్నది. గట్టిగా కసరి మాన్పఁ జూచెదఁ గాక. (ప్రకాశము) ఏమిమంథరా! దేహము తెలియక మాటలాడు చున్నావు. నాశక్తి నెఱుఁగవా? నీయిష్టమువచ్చినట్లు ప్రేలుచున్నావు. రాముని నింకొక్కమాఱు దూషింపుము? ఏమిచేసెదనో చూడు.

మంథ:—కైకా! ఇఁక నీకడనుండనోప. నీయన్నము తిన్నందుల కింతమాత్రము చెప్పవలసివచ్చెను. నే నెందేని బోయి యేగుంటలోనో యేనదిలోనో పడిపో యెద. ఇఁక రానున్నకష్టములఁ జూడఁజాల. దూరముననున్నను వినలేను.

కైక:—(ఆత్మగతము) ఇది వాస్తవముగా నాయందుఁగల ప్రీతిచేతనే యిట్లుపల్కు చున్నది. ఇఁకఁ దూలనాడరాదు. దానిభావ మేమో కనుఁగొనియెద. (ప్రకాశము) మంథరా! ఎందులకే యింతటియులికిపాటు. క్రోధముడిగి చక్కఁగాఁ జెప్పుము. ఆలకించెదను.

మంథ:—రాముఁడు రాజయినఁ గౌసల్య పట్టపుదేవియై యీవఱకున్నగర్వమునకుఁ దోడుగా మఱికొంతగర్వ మెక్కించుకొని రాజునకుఁ బ్రీతిపాత్రమవైన నిన్నుఁ బెట్టరానిబాధలఁ బెట్టించును. ఆమెకెల్లరును లోఁబడుదురు. నీవు పిలిచినను బలుకువా రరుదు. వృద్ధరాజున కేయధికారములుండవు. సుమిత్రయుఁ గౌసల్యనే యనుసరించున్నదియే కాన నామెకుఁ గూడ నధికారము గల్గియుండు. ఇంతకాలము పట్టపుదేవికంటె నెక్కువయధికారము గలిగిననీవే యిపు డేయధికారము లేక పరిచారికవలె నుందువు. (అనికన్నీరు విడుచుచు నిలువంబడును.)

కైక:—(తనలో) ఈమంథర చెప్పుమాటలు కేవల మసత్యములు కావు. త్రోసివేయఁ దగినవియుఁ గావు. నాకేమియుఁ దోఁచకున్నది. వినియును వినకయుండ రాదు. చక్కఁగాఁ బరీక్షింపవలసినవిషయములే యివి. (ప్రకాశము) మంథరా! కొంచె మాలోచించుచున్నాను. నీమాటలు వ్యర్థములనరాదని తోఁచుచున్నది. త్వరపెట్టకుము. క్షణకాల మింకను మనస్సులో నాలోచించెద.

(ద్వారపాలకుఁడు ప్రవేశించును.)

ద్వార:—జయము జయము తల్లిగారికి.

మంథ:—ఏమివార్తలు.

ద్వార:—యుధాజిత్తురాజుగారిదూత పత్రికతో ద్వారమునఁ గాచియున్నాఁడు.

కైక:—(ఆతురతతో) మంథరా! త్వరగా వాని నిటకుఁ బంపుమని చెప్పుము.

మంథ:—త్వరగా నాతని నిటకుంబంపుము. ద్వారమున జాగ్రత్తతోనుండుము.

ద్వార:—చిత్తము.

1. స్వశక్తిప్రశంసనముచే నిది వ్యవసాయము.

(ద్వారపాలకుఁడు నిష్క్రమించును)

{ దేవేంద్రప్రేరితుఁడగు సునాభుఁడనుగంధర్వుఁడు మనుష్యరూపమునఁ బత్త్రికతోఁ బ్రవేశించును. }

దూత:—(ప్రవేశించి) జయము జయము మహారాణిగారికి.

కైక:—పురమున నందఱకుం గుశలమా. భరతుఁడు తమ్మునితోఁ గుశలియై యున్నాఁడా.

దూత:—అందఱకుం గుశలమే. ఈపత్త్రికం దిలకింపుఁడు. (అనియందిచ్చుచు) రాచకార్యములున్నవి. నన్ను వేగముగ రమ్మని యాజ్ఞయైనది. సెలవీవలయు.

కైక:—(పత్త్రికయందుకొని కుశల మనునక్షరములను గాంచి) మంచిది. వెళ్లవచ్చు.

దూత:—చిత్తము.

(అని నిష్క్రమించును)

కైక:—(పత్త్రికనువిప్పి యిట్లు చదువుకొనును)

"నిత్యసౌభాగ్యవంతురాలగు మాతకుఁ బుట్టువునకు. సోదరుఁడు యుధాజిత్తు కుశలప్రశ్నముచేసి వ్రాయు విషయములు. ఆకస్మికముగా శ్రీరామునకుఁ బట్టాభిషేకము జరపఁబడుననియు నందులకుఁ బ్రయత్నములు జరగుచున్నవనియు, నతిశీఘ్రముగాఁ జేయనిశ్చయించిరనియు నేఁడొకవార్త వినవచ్చుటచే నాకు విచారము గలిగి యది పెచ్చుపెరుగుచున్నది. నాకుఁ దెలుపకయే బావగారిట్టిప్రయత్నము చేయుట యాశ్చర్యముగా నున్నది. భరతుఁ డటలేఁడుగదా. ప్రకృత మాకార్యము నిలిపిన నేనువచ్చి మాటలాడెదను. చెప్పవలసినవిషయము లనేకములున్నవి. ఇంతకన్న నిపు డెక్కువవ్రాయ వీలులేదు. చక్కఁగా నాలోచింపుము.

ఇట్లు సోదరుఁడు, యుధాజిత్తు.

కైక:—(పత్త్రికనుదాఁచి తనలో) ఏమిది! ఇట్లువ్రాయుటకుం గలకారణ మేమి? నాకే పట్టాభిషేకవార్త తెలియలేదే. నాసోదరున కెట్లుతెలిసినది. చాలకాలము నుండి ప్రయత్నములు చేయుచున్నట్లు పొడకట్టుచున్నది. నాకేల ప్రాణేశ్వరుఁడు తెలుపలేదు? ఇదియంతయుఁ గౌసల్యపన్నిన కుట్ర కాఁబోలును. నేనేమైన విఘ్నము చేయుదునని యామె కనుమానము కలిగినదికాఁబోలు. ఇదంతయుఁ జూడ నందఱొక్కటియయి యున్నట్లు తోఁచుచున్నది. ఎన్నఁడే నొకయపకారము రామునకుం జేసియుంటినా. నోట నొక్కమాటయైనను రామునకహితముగఁ బల్కియుంటినా. ఏయుద్దేశ్యముతో నందఱు నన్నిట్లు వేఱుచేసిరి? ఆహా! మంథర నేమో యంటిని. దానికెంత ప్రేమగలది. కాని! ఇదిపల్కుమాటలు విని కర్తవ్య మాలోచించెద. (ప్రకాశము) మంథరా! ఇఁక నీ వేమని తెలుదవు?

మంథ:—ఇఁక నే నేమనుదుతల్లీ ! నీగతి యెుందేమియగునో యని యూహించుచు న్నాను. వేఱొక యూహ నాకులేదు. భరతుఁ డింతకాలము మర్యాదగాఁ బెంపఁ బడియె. ఇఁకముందు దాసీపుత్త్రుఁ డని యందఱు బిలువఁ జింతనొందుచుండుఁ గద. ఇన్నిటికి నీశాంతమే కారణము. ఇంతకన్న నే నేమందును ?

కైక:—(నిట్టూర్పులువిడిచి) మంథరా ! అంతటికాలము వచ్చునా ?

మంథ:—వచ్చునా ? వచ్చికూర్చున్నది.

కైక.—(కోపారుణితనేత్రయై) నేను గౌసల్యయింట దాసినై యుండవలయునా ? నాపుత్త్రుఁడు దాసీపుత్త్రుఁడనంబడునా? ఔరా కాలము ! అట్టికాలముగూడ వచ్చునేమో.

మంథ:—తల్లీ ! ఏకపటమెఱుఁగని మీకిట్టి పాట్లు తెచ్చిపెట్టసిద్ధముగా నున్నారు. ప్రాణేశ్వరుఁడు నాపై ననురాగము కలవాఁడని విఱ్ఱవీఁగుచుంటివి. తెలిసినదా యిపు డాయనప్రేమ మెట్టిదో. ఇఁకనైనఁ ద్వరపడినమేలు.

కైక:—మంథరా ! మంథరా ! నేనిపు డేమి చేయవలయునో తెలుపుమా. పెక్కు మాటలేల ?

మంథ:—పట్టాభిషేక మారామునకుఁ గాకుండఁ జేయవలయు.

కైక:—అదెట్లుసాధ్యమగును ? ఇంత మోసముచేసి ప్రయత్నము చేసినవారు నామాటల నాలకింతురా.

మంథ:—నా చెప్పినచొప్పునఁ బ్రవర్తింతునని వాగ్దానము చేసినఁ జక్కనియుపాయము చెప్పెదను.

కైక:—దానితో నాకష్టములు తొలఁగునా. కుమారుఁడు దాసీపుత్త్రుఁడు గాకుండునా మంథరా ?

మంథ:—అదియొకగొప్పయా. కౌసల్య నీకు దాసియగును. భరతుఁడు రాజగును. నీవే రాజమాతవగుదువు.

కైక:—అట్లైన నీమాటజవదాఁట నని భరతునిపై నొట్టుపెట్టి శపథము చేయు చున్నాను.

మంథ:—జననీ ! నామాటలఁ జక్కఁగా నాలకింపుము. పూర్వము శంబరాసురునితో దేవతలకు జరగినయుద్ధమందు దశరథమహారాజు దేవతలు ప్రార్థింప యుద్ధమునకు సిద్ధపడియె. అప్పటి నీవు క్రొత్తగాఁ గాపురమునకు వచ్చియున్న దానవగుటఁ భర్త నువిడిచియుండనొల్లక నేనును వత్తునంటివి. నీప్రాణేశ్వరుఁడును నీయందున్న తమి పెల్లిదంబున నొంటిగాఁ బోవఁజాలక నీరాక కంగీకరించెను. నీవును శరవిద్యా పాటవంబు గలదానవుగాన తేనికిం బ్రీతియు శౌర్యంబును గలుగఁబలుకుచుం

బోయితివి. దారుణసంగరంబున నీ ప్రాణేశ్వరునకు నపాయంబు ప్రాప్తింప నీసామర్థ్యవిశేషంబున దానిం దొలఁగించుటయేగాక శత్రువులఁ జెంతఁజేరనీక పాఱఁదోలితివి. అంతమూర్ఛనుండి విముక్తుఁడయి రాజు నీచేసిన మహాకార్యమున కచ్చెరువంది నీ ప్రతాపంబునకు మెచ్చి యీరెండుకార్యములకుగా రెండువరము లిచ్చెను. ఆసమయమున నీకుఁ గావలసినది ప్రాణేశ్వరుసంరక్షణమే కాఁబట్టి యావరంబులు వలసినపు డడిగెద నిపు డేలయంటివి. రేఁడును నీవుకోరినప్పు డేమాట యయు నడ్డుచెప్పక నెఱవేర్చెదనని శపథముచేసెను. ఈవిషయము నీవింటికి వచ్చిన వెంటనే నాయందుఁగల ప్రీతిచే నాకెఱిఁగించితివి. కాఁబట్టియే నేనుజూచిన ట్లిపుడు చెప్పితిని.

కైక:—(స్మరణమభినయించి) మంథరా! నీవు చెప్పినతర్వాత నాకుఁ జక్కఁగా జ్ఞప్తికివచ్చినది. చాలకాలమైనది గాన మఱచియుంటిని. చక్కఁగా జ్ఞాపకము చేసితివి. దీనిచే నిపుడు మనయుద్దేశ్యము నెఱవేఱునా.

మంథ:—[1]ఇంకను సందియమా. కష్టములన్నియుఁ దొలఁగిపోయినవి. భావికాలమున సకలశుభములు తప్పక పొందఁ గలవు.

కైక:—[2]అట్టి ప్రాణాపాయసమయమం దట్టియుపకారమొనరించి నా ప్రతాపమును జూపియుంటిని. నాకే యిపు డాశ్చర్య మగుచున్నది.

మంథ:—అట్టినీకు దాస్యముచేకూర్ప నెంచిరిగదా. నేనును దొలుత చెప్పినప్పుడు నామాటలు చేఁదుగా నుండెనుగాఁబోలు.

కైక:—నిశ్చయమే. ఏమో యనుకొంటిని. ఇంతమోసము గలదని తెలియఁ జాలనైతిని. పరిహాసముననో కోపముననో యపుడు నేనన్నమాటలు మఱచిపొమ్ము.

మంథ:—తల్లీ! నీవన్నమాటలచే నాకుం గోపముగల్గునా. రోషము పట్టఁజాలక నే నన్నమాటలను మీరు క్షమింపఁ జేతులొగ్గి ప్రార్థించుచున్నాను.

కైక:—ఇఁక నీవుచెప్పఁబోవు నుపాయముచేత నాయుద్దేశ్యము నెఱవేఱునా.

మంథ:—[3]ఇంకను సందియమా. నామాటలు పాటింపుఁడు. కార్యము హస్తగతమే. సకలశుభములు నీకుంగలుగు. నీకుమారుఁడు గౌరవపాత్రుఁడై విలసిల్లును.

కైక:—ఇఁక నేఁజేయఁదగిన కార్యభంగి నెఱిఁగింపుము. నీమాటయెట్లో యట్లే చేసెదను.

---

1 సిద్ధామంత్రణమువలని భవిష్యత్ప్రదర్శకయగుటచే నిది ప్రరోచనము.

2 స్వగుణస్తుతిరూపమగు విచలనము.

3 కార్యసంగ్రహము దెలుపుటచే నిది యాదానము.

మంథర:—

చ. జననిరో ! క్రోధమందిరముం♦జయ్యనఁ జొచ్చి విభూషణాళి మే
దిని బడవైచి హారములఁ♦ద్రెంపి యటుం బడఁజిమ్మి కేల్జెడన్
మనమున సంశయంబు నణు♦మాత్రము పొందక విప్పి ధూళిఁ బ్రుం
గునటులొనర్చి జీర్ణమగు♦కోక నదెట్టులొ కట్టి శోకముం
గనినవిధిం బరుండుము ; నృప♦కాంతుఁడు నిన్గనవచ్చినంతటన్. 5

తే. పలుకకుండుము నీకేమి♦వలయుఁ గోరి
యిచ్చువాఁడను దెల్పవే♦యింతిమిన్న !
యనుచు వేఁడిన కాలఁదినే♦మనక బిఱ్ఱ
బిగిసికొనియుండు నామాట♦విశ్వసించి. 6

కైక:—తరువాతఁ జేయఁదగిన కార్యమేది?

మంథ:—అవ్వలికార్యము నేఁజెప్పవలయునా ? నీకుఁ దోఁపలేదా.

కైక:—నీవు చెప్పినట్లు చేసెదనంటిఁ గదా.

మంథ:—సంతోషము. విను మవ్వలఁ జేయఁదగినపని.

సీ. రాజ్య మిమ్మందువా♦రాజీవగంధిరో
యనివేఁడినట్లైన♦నౌ ననకుము
సొమ్ము లిమ్మందువా♦సొగసులాఁడీయన్నఁ
గావలెనాకని♦నీ వనకుము
దాసదాసీజన♦తతుల నిమ్మందువా
సరసాంగిరోయన్న♦సరియనకుము
సకలభోగంబుల♦సమకూర్పుమందువా
భామినీమణి యన్న♦నేమనకుము

తే. పడఁతి నీకేమికావలెఁ♦బల్కు మింకఁ
బల్కకున్నను నేనిల♦బ్రదుకననుచుఁ
బ్రేమ మింపెసలార నీ♦ప్రియుఁడు వేఁడ
నించు కెలుఁగెత్తి మాటాడు♦మింతిమిన్న. 7

కైక:—మాటాడుమనియా యధికారము నాపైఁబెట్టుము. నీవేయామాటలఁ గూడ నేర్పుము.

మంథ:—మఱిమఱి ప్రార్థించి వగచి నిట్టూర్పులంబుచ్చి వేఁడునట్లు చేయుము. తుదకు నీకేమికావలసిన నిచ్చువాఁడ. తప్పను నియోగ అన్నప్పుడు.

చ. పురుషుల నమ్మరాదు పలుపోకలఁ బోవఁగనేర్తు రెంతో యా
దరణముగల్గఁ బల్కి యికఁ దప్పక కోర్కె ఫలించునన్న యా
తురమును బొందఁ జేసి తమితో సతిపల్కఁగఁ గోర్కె దీరఁగా
బిరుసువహించి యవ్వలను వేఁడినఁ బల్కరటంచు నాడు మా. 8

కైక:—తరువాత? తరువాత?

మంథ:—మఱియుఁ దమి పెల్లిదంబాపఁజాలక భర్త ప్రార్థించిన నాతనియాతురముం గాంచి మెల్లఁగా

క. మనుజేశ! నామనోరథ
మును దీర్పఁగఁ దలఁతువేని మోమోటమి మా
ని నయమ్మున శపథముఁ జే
సినఁ జెప్పెద లేకయున్నఁ జేరెద దివినిన్. 9

అనిగట్టిగాఁ జెప్పుము.

కైక:—ఆమీఁద?

మంథ:—రామునితోడు తప్పకచేసెదనని మూఁడుపర్యాయములు చెప్పినతరువాత పడకనుండిలేచి కన్నీరుఁదుడుచుకొనినట్లు నటించి డగ్గుత్తికతో, "రాజేంద్రా! ఇక్ష్వాకువంశజులు సత్యవ్రతపరాయణులనియు, దిగంతవిశ్రాంతయశోవిరాజితులనియుం దలంపుము. ఇపుడు ప్రతిజ్ఞ సేసితివికదా. సకలలోకవిఖ్యాతకీర్తియశో ధురంధరుఁడవు. చెప్పినమాట తప్పకుము. నాకోరికల నాలకింపుము. పూర్వము శంబరాసురునితో సంగరమొనరింప దేవతలకు సహాయుఁడవై పోవుచు నన్ను వెంటంగొనిపోతివి. ఆదారుణసంగ్రామమున నడురేయి యాక్రూరరాక్షసుఁడు నిన్ను మార్కొని భీకరశరంబులు ప్రయోగించుచుఁ జాలసేపు పోరాడెను. నక్తంచరులు రాత్రిబలము గలవారు గాన మిమ్మతఁడు మించి నొప్పించెను. మీరా వ్రేటులకుఁ దాళఁజాలక మూర్ఛమునింగితిరి. ఇఁక నా క్రూరసురవైరి మిమ్మేమిచేయునోయని నాశక్తినంతయుఁ జూపి యాతనియాటోపమును గొంతమాన్పి యరదంబును దోలఁగించి దూరము కొనిపోతిని. సారథియంతకుముందే మ్రందెఁగదా. మీరు మూర్ఛనుండి తెలిసి మరల మార్కొన రథమును దోలుమంటిరి. ఆసమయమున శత్రువునాటోపంబు సైరింపలేని మీకు సారథిచచ్చుట తోఁచినదికాదు. నేనును రథంబుం బఱపి సారథిచమత్కృతిం జూపితి. మీరాతనితోఁ బోరాడితిరి గాని యాతఁడు మిమ్ము మించి నొప్పించెను. రెండవపర్యాయముగూడ గాఢమూర్ఛ నొందితిరి. ఇఁక నిటనుండఁగూడదని దూరముగా నరదంబుం దోలితి. అప్పటికి రక్క

సునుండి తప్పించితి. మూర్ఛంబాసి మీరు నాకృత్యమునకానందించి నన్నుఁగౌఁ టంజేర్చి ప్రాణములంగాపాడితివి. నీవులేకున్న నేఁజచ్చియుండు. ఇట్టినీమహోప కారమునకును, నీవారక్కసునియాటోపంబుఁ గొంతతగ్గించి దేవతలు బలీయనంగఁ బరాక్రమంబు నెఱపినందులకును మెచ్చి రెండువరముల నిచ్చువాఁడ. కోరుకొను మంటిరి. మీరుజీవించి మరలమాటాడుదురా యన్న సంశయమున నుండియున్న దాన గానమీరు కోరుమన్నమాటయే చాలునని వలసినప్పుడు కోరెదనంటిని. ఇద తయుం స్మృతిగోచరమైనదియా'' యని యడుగుము.

కైక:—అపిదప ?

మంథ:—రాజు స్మరణమభినయించినపిదప ''నారెండువరముల నిపుడు గోరెద. మాట మాటాడక యీవలయు''నని యడుగుము. సత్యముగానిచ్చెదఁ గోరుమన్నప్పుడు.

చ. వనిఁ బదునాలుగేండ్లు రఘు♦వర్యుఁడు రాముఁడు వల్కలాజినా
ళిని ధరియించియుండఁ దగు♦లీలమెయిన్ భరతుండు రాజుగాఁ
జను నివియే వరంబు లిఁక♦స్వాంతమునందు మఱొక్క రీతిఁగా
జనవర! యెంచ కీవలయు♦సత్యముఁ దప్పక యీక్షణంబునన్.

అని గట్టిగానడుగుము. (అనియేమో చెవిలోఁ జెప్పును)

కైక:—మంథరా ! నీవుచెప్పినట్లే చేసెదను. ఇఁకనీ విటనుండకుము. రాజువచ్చు సమయము కావచ్చుచున్నది. నీచెప్పినట్లే చేసెదను.

మంథ:—తల్లీ! రాజు బ్రతిమాలును జుమీ. బేలుపోకుము. కార్యముచెడును. దాసి విగాఁ దలంపకుము. భరతుని దాసీపుత్రా ! అని పగవారు పిలువంజేయకుము.

కైక:—మంథరా ! కేకయరాజునకుం దనయనేనైయైన నట్లుచేయుదునా. కార్యము సాధించియే తీరెద. నీవింకఁ బొమ్ము. ప్రాణేశ్వరుఁడువచ్చువేళ యైనది.

(అని యందఱు నిష్క్రమింతురు)

1 (ఇది విమర్శసంధి).

చతుర్థాంకము సంపూర్ణము.

---

1 నియతాప్తిప్రకరీసంబంధరూపమగు విమర్శసంధి ప్రధానాంగసంయుక్తం బుగఁ జెప్పఁబడినది.

శ్రీరస్తు

# విచిత్ర పాదుకాపట్టాభిషేకము

---

## పంచమాంకము

(ఆకాశమున సమ్మోహన సుకేశు లనునిరువురు గంధర్వులు ప్రవేశించుచున్నారు.)

సమ్మో:—మిత్రమా! చిరకాలమునకు దేవతావాంఛ నెఱవేఱినది. ఈవిషయమును బరిశీలించిరం డని యింద్రుఁ డనుమతి యిచ్చెఁగదా. ఏల యింత యాలస్యము చేసివచ్చితివి.

సుకే:—సఖా! మఱేమియు లేదు. కొంచెమింటిపని యుండఁగాఁ దీర్చుకొనివచ్చితిని. క్షమింపుము. దివిజేశ్వరునానతిఁ జవదాఁటువాఁడనా ?

సమ్మో:—ఇంటిపని కిదియాసమయము ?

సుకే:—కాదుగాని ఆపనిలో నీపనికింగూడ నించుక సహాయముగలుగునట్లు తోఁచె. కాఁబట్టి యద్దానిం దెలిసికొనుచుంటిని.

సమ్మో:—ఈకార్యమునకు మీయింటిపనినుండి సాయ మొనఁగూడు టెట్లు ?

సుకే:—మనమీవిషయమును భూలోకమున కవతరించి కనుఁగొనఁబనిలేకయే తెలిసికొంటిని. విను.

"దేవేంద్రు ననుమతిచే మనసునాభుఁడు మనుష్యరూపమునంబోయి రామాభిషేక భంగమగు పని చేసియేవచ్చినాఁడు. ఆవిషయము నతఁడు చెప్పఁగా వినుచుంటిని.

సమ్మో:—ఎట్లుచేసివచ్చినాఁడు ?

సుకే:—దశరథుని చిన్నభార్య కామెసోదరుఁడు పత్రిక వ్రాసినట్లు పత్రికను గల్పించియంతకుముందే దేవప్రేరితురాలగు మంథరయను పేరుగల కైకదాసి యావిషయము నేచెప్పుచుండఁగా నాసమయమున నీపత్రికనీయ దాన నామెమనస్సుచంచలించి తనశక్తిని జూపి పట్టాభిషేకభంగ మొనరించి రాము నడవులకుంబంపి తన కొడుకు యువరాజునుగాఁ జేయుదునని పట్టుపట్టినది తెలిసికొని వచ్చినాఁడు. ఇఁక దేవతాకార్యము నెఱవేఱినట్లేకదా.

సమ్మో:—ఇంతమాత్రముచేతనే దేవకార్యము ఫలించునో లేదో యనుసందియ ముద యించుచున్నదిసఖా !

సుకే:—సంశయ మిసుమంతయు వలదు. నెఱవేఱకరదేయని త్రికరణశుద్ధిగా నమ్ముము.

సమ్మో:—నీమాటలవైఖరినిబట్టి నమ్మెదనుగాని యీనీమాటలు నమ్మి యింద్రునికడ నీవిషయమును దెల్పుటకు మనస్సుత్సాహము నొందకున్నది.

సుకే:—మిత్రమా ! నే నసత్యముచెప్పితినని నీయభిప్రాయమా.

సమ్మో:—కాదు. "గతానుగతికోలోకః" యటన్నమాట వినమే. ఒకరుచెప్పినట్లు నీవును, నీవుచెప్పినట్లు నేనునువినుచుండినఁ బ్రత్యక్ష మెప్పుడగును ? కన్నులారఁ జూచి గాని యధిపతికిం దెలుపంజాల.

సుకే:—ప్రాణసఖా ! నీసంశయమును దీర్చెద. ఇప్పుడే దశరథుఁడు చిన్నభార్య యింటికిం బయనము సేయుచున్నాఁడు. మనమదృశ్యరూపులమై యావిషయమును బరిశీలించినత్తురా.

(అని నిష్క్రమించుచున్నారు)

(ఇది శుద్ధవిష్కంభము)

---

(దశరథుఁ డొంటిగాఁ బ్రవేశించుచున్నాఁడు)

దశ:—1(తనలో)

చ. పురజనులెల్ల నౌరయని పొంగుచునుండఁగ మంత్రిసత్తముల్
సరియగు కార్యమే యిదని సన్నుతిసేయఁగ బాంధవుల్ ముదం
బరుమగఁ బొంద నాదయిన యాశయమెల్ల ఫలింప రామునిన్
వరగుణసాంద్రు రేపె చెలువంబలరన్ యువరాజుఁ జేసెదన్. 1

ఇమ్మహాకార్య మెపుడెపుడు జరగునా యని యువ్విళ్లూరుచున్నెల్లరును దత్ప్రయత్నములయందే మునిఁగియుండ నేనిఁక నాలస్యముచేయుట న్యాయముకాదు. భరతుం డిటలేకుండుటచాలమేలు. ముహూర్తము రేపేకుదిరినది. ఈయుత్సవమును గన్నులారఁ జూచితినా నాతపంబులు ఫలించినట్లే. ఇంతకాలము రాజ్యపాలన మొనర్చితిని. ఇఁక నా దేహము విశ్రాంతిసుఖము ననుభవించుట యుక్తము. సకలగుణాభిరాముఁడగు రాముఁడు తనకుఁ బాలకుఁడుగనుండుట మంచిదని భూదేవి

---

1 పూర్వాంకోక్తవిషయము నుత్తరాంకమునఁ బొందుపఱచుటచే నంకావతరణము.

యీ స్వప్నమున దర్శనమిచ్చి నాకుం దెల్పెనుగదా. నేనును గృతకృత్యుండనై కన్నులపండువుగా రామునిపరిపాలనాచమత్కృతిని జూచుచుండెద. ఈశుభవార్తను నా ప్రియపత్నియగు కైకకుం దెలిపినం గాని నామనస్సు కుదుటంబడదు. ఈవిషయమునం గైకయుం గుతూహలపడుచుండినదిగాని వేఱువిధముగం దలంచునది కాదు. భరతునికన్న రామచంద్రునే ప్రేమించుచుండును. కనుకనే రామచంద్రుని ప్రవర్తనముసమానమని యెల్లరు కొనియాడుచున్నారు. సకలయత్నములు సిద్ధము లగుచున్నవి. అయినపని కూడం దలంపవచ్చును. ఏపనికైనను నేనాజ్ఞ సేయంబూనినయంతనే సాగుచున్నది. ఔరా! జనరంజకుండు రాముండనుట కేమిసంశయము ?

[1] ఈయుత్సవమున నెల్లరం దృప్తి నొందించెద. మూండుదినములుగ నేనీకార్యమున మునింగియుండితి. కైకయింటికిం బోవనైతి. ఇంక క్షణములోపల నాతరుణీమణి ముఖచంద్రదర్శనమైనంగాని మనస్సు హాయిచెందదు. ఏకాంతమున నామెతో ముచ్చటించెద. ముందుం గౌసల్యయింటికిం బోయి యొకమాటచెప్పి వెంటనే కైకసౌధము నకుం బోయెద.

(అని నిష్క్రమించును)

---

(దశరథుండు కౌసల్యాసౌధమును బ్రవేశించును)

దశ:—[2]ఔరా! ఈసౌధము చక్కంగా నలంకరింపంబడి యున్నది. ఈయలంకారములు క్రొత్తవి. నిన్ననే యలంకరింపంబడినట్లున్నవి. బంగరుపూత లింకను జక్కంగా నారలేదు. ఈనగరు రే పెట్లుండునో (ముందునకునడచి) కౌసల్య పూజాద్రవ్యములు చేతం బట్టుకొని వచ్చుచున్నట్లున్నది. నేను ఈదేవి కీశుభవార్తను జమత్కారముగా నెట్లు తెల్పవలయును ? (కొంచెమాలోచించి) సరే. ఇద్దఱము జరాపీడితులమే. చమత్కార మేమాత్రమున్నం జాలును. (దృష్టిసారించి) ఇదిగో కౌసల్య వచ్చుచున్నది. నేనును నడినడినేగెద. (అని లోపలికిం బోవును)

కౌస:—(నమస్కరించి పూజించి యథార్హాసనాసీనుంజేసి విసరుచు నిలువంబడును)

---

1 సుప్రసిద్ధబీజఫలమును నిర్వహింపంజేయుటచే నిర్వహణసంధి యారంభింపంబడినది.

2 కార్యమార్గణరూపమగు విబోధనము.

దశ:—సాధ్వీ ! వృద్ధున కేమియుపచారములు? నీవును నాయంతదానవే.

కౌస:—(తనలో) ప్రాణేశ్వరుఁ డింతకుమును నన్ను రాజ్ఞీయనిపిలుచుచుండుట వాడుక. ఇపుడేలొకో సాధ్వీ యనుచున్నాఁడు. కనుఁగొనియెద. (ప్రకాశము) ప్రాణేశ్వరా ! రాజ్ఞీయనుటయుం గూడ నేనర్హురాలను గాను గాఁ బోలు?

దశ:—(నవ్వి చేరఁదీసికొని) బేలా. ఎంతకాలమనుభవించినను రాజ్యభోగములు చాలవా; తృప్తినొందఁ బనిలేదా.

కౌస:—(ఊరకుండును)

దశ:—1నానోటనే చెప్పించుట నీకిష్టముగ నున్నది కాఁబోలు. వినఁ జెప్పెద వినుము. శ్రీరాముని యువరాజునుగాఁ జేయనెంచితి. ముహూర్తము దాపుననే యున్నది.

కౌస:—రఘువంశసంభూతుల యూహ లమూల్యములు. అనుపమానములు దుర్జ్ఞేయములు.

దశ:—తెలిసియుఁ దెలియనట్లు నటించెదవు.

కౌస:—ఇతరులాడుమాటలు సత్యములనినమ్ము నాచారము నాకులేదు. తమయానతియే నాకు నమ్మకము.

దశ:—2ఇపుడు నమ్ముము. రేపే ముహూర్తమని నిశ్చయించి పెద్దలుచెప్పిరి.

కౌస:—3ప్రాణేశ్వరా ! పరమానందము. చిరకాలమునకు నీమహాసంతోషవార్త విననోచితిని. మనయిరువురి తపస్సులును నేఁటికి సంపూర్ణముగా ఫలించినవి. ఇఁక నేనేమిచేయవలయు ?

శ:—4చేయఁదగిన కార్యములు పెక్కులున్నవి. అందుముఖ్యమైనది నీవుసంతోషపడుటయే. ఇఁకఁ గులదైవములఁ బూజింపవలయు.

కౌస:—5భూపాలతిలకా ! మీయానందమే నాయానందము. నేఁటికి మన మిరువురము పరమానందభరితుల మైతిమి. మీయానతిం దలఁదాల్చి మరలఁ గులదైవములం బూజించెద.

---

1 కార్యోపక్షేపణరూపమగు గ్రథనము.

2 అనుభూతాఖ్యానరూపమగు నిర్ణయము.

3 ప్రకృతార్థ మిథోజల్పనరూపమగు పరిభాషణము.

4 పర్యుపాసనరూపమగు ప్రసాదనము.

5 వాంఛితార్థరూపమగుట నిది ఆనందము.

దశ:—1చిరకాలము సంతానములేమికిఁ దగచి దివ్యసంతానమును గంటిమి. దానఁ గొంత కష్టము తీరెను. ఇపుడు మనకృత్యమును సంపూర్ణముగ నెఱవేర్చిన నంత యుఁ దీరును.

కౌస:—2మీయుద్దేశ్యము లన్నియు సర్వేశ్వరానుగ్రహమువలన ఫలించుఁ గాక. రేపే యీకార్యము నెఱవేఱుఁగాక. నాకోరికయు ఫలించినది.

దశ:—(మరలఁ జెంతకుఁ దీసికొని సంతోషముతో) నేఁటికి నీకుఁ బరమానందము చేకూరెనా. అదియ నాకు బ్రహ్మానందము. ప్రాణేశ్వరీ! ఇఁకఁ దడవుసేయరాదు. కార్యభారములు పెక్కులున్నవి. రేపువచ్చి మాటలాడెద. గట్టిగా భగవంతు నారాధింపుము. ఆయన యనుగ్రహము లేకయున్న సర్వార్థములు ఫలింపవు. దానిఁబొందఁ గోరుము. కృతకృత్య వగుదువు.

(అని నిష్క్రమించును)

---

(తరువాతఁ గైక సౌధమును దశరథుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దశ:—(ముందునకునడచి నాలుగుదిక్కులు కలయఁజూచి తనలో) సౌధమిది యేల కైసేయఁబడలేదు? సహజశృంగారసంవర్ధితముగదా యీసౌధము? దీనికేల క్రొత్తశృంగారమని తలఁచినది కాఁబోలు నాముద్దులరాణి! (మఱినాలుగడు గులు పెట్టి) ఆ! ఏమిది? కావలివారెవ్వరును గానరారు? నిశ్శబ్దముగ నున్నది. ఏమో (కొంచెమాలోచించి) మఱేమియుఁ గాదు. నానోములపంట, నాకోరి కలపెన్నిధి, నాప్రేమాంభోరాశి నాముద్దులరాణి కేకయరాజప్రియపుత్రిక నా రాక కువ్విళ్లూరుచు నాతోసల్లాపము లాడఁగోరి యెవ్వరును లేకుండఁజేసియుం డును. నన్నుఁజూడఁగనే కౌఁగిటంజేర్చి తానే మాటలాడును. ఔరా!

చ. పరిమళముల్ చెలంగఁగ శుభస్కురమౌ తనువల్లి యొప్ప సుం
దరముఖచంద్రబింబరుచి నై జనుశీతలతేజ వ్యయింపఁగాఁ
దరుణి తనంతవచ్చి ప్రియుఁ దల్పముఁ జేరిచి కౌఁగిలించి యా
దరణముమీఱఁ బల్క విను ధన్యుఁడె భాగ్యయుతుండు ధాత్రిలోన్.

సెబాసు! కాంతారత్నముల ప్రేమములు మనోహరములు. సామాన్యదృష్టికి గోచరింపవు. ఇఁకఁ దడవుసేయరాదు. అపరాధమగును. త్వరగాఁ బోయినాముద్దుల మిటారిం జూచెద (మఱికొంతదూరముపోయి) ఏమిది? కక్ష్యాభాగములయందుఁ

---

1 దుఃఖనిర్గమనరూపమగు సమయము.
2 లబ్ధస్థిరీకరణరూపమగు కృతి.

గావలివారలు కూడ లేరు. (ఆలోచించి) దురవగాహముగా నున్నదే. నామనస్సు తల్లడిల్లుచున్నది. కారణ మేమైయుండును. (లోపలికిం జని)

సీ. ఇదె నాదు ప్రియభామ ♦ యెలమిమీఱంగ నన్నుఁ
బరిరంభణము చేయు ♦ భవ్యతల్ప
మిదె నాదు ప్రేయసి ♦ యింపుమీఱంగ నన్నుఁ
గవఁగూడి విహరించు ♦ క్రమ్రశయ్య
యిదె నాదుదయిత నా ♦ కెంతేముదంబునఁ
బాదసేవ యొనర్చు ♦ పట్టిమంచ
మిదె యిదే నాజీవి ♦ తేశ్వరి నారాక
కెదురుసూచుచు నిల్వ ♦ నెసఁగుతావు
కటకటా! నేఁ డిదేమొకో ♦ కాంత నాదు
కనులు చల్లఁగఁ జేయంగఁ ♦ గానరాదు
కోపమందెనో నారాకఁ ♦ గోరి పైన
నిలిచి చూచుచు నున్నదో ♦ నీరజాక్షి. 3

(కొంచెము ముందునడచి యేమోచప్పుడువినరాఁగా) లోపల నేమోచప్పుడగుచున్నది. ఒకరో యిద్దఱో తిరుగుచున్నట్లు తోఁచెడు. (ముందునకుంజని) హంసగమనా నాదేవి యెందున్నది? అంతఃపుర మిట్లున్నదేమి?

హంస:—(విచారముతో) దేవిగారు క్రోధగృహంబునఁ బరుండియున్నారఁట. నే నిపుడే వచ్చితిని. పద్మాక్షి చెప్పఁగా నీమాటయే విన్నాను.

దశ:—పద్మాక్షి యెందున్నది?

హంస:—ఆగదిదగ్గర నున్నట్లున్నది.

దశ:—(పరిక్రమించి) పద్మాక్షీ!, నా ప్రాణేశ్వరి యెందున్నది?

పద్మా:—కోపగృహంబున నేడ్చుచుఁ బరుండియున్నది.

దశ:—కోపగృహంబున నేడ్చుచుఁ బరుండియున్నదియా ఏదేది? (నాలుగడుగులు ముందునకు నడచి) అక్కటా! నాపాదములు తొట్రుపడుచున్నవే. ఏలాకో నాయన్నులమిన్న యందుఁ బరుండుట. అంతచాలక యేడ్చుచున్నదఁట. నేనిఁక బ్రదుకఁ గలనా. ఏమని మాటలాడింతును? (గదిచెంతకుం బోయి) తలుపు మూయఁబడి యున్నదే. (కొంచెము తెఱచిచూచి) ప్రాణేశ్వరీ! కేకయరాజపుత్రీ! నాముద్దులమిటారీ! (అనిపిలుచుచు.)

కైక:—(ఏడ్చుచుండును)

దశ:—(లోపలఁ జొచ్చి యాభరణములు పాదములకుం దగులఁ గ్రిందఁజూచి) ఆఁ. ఇవియాభరణములా. ఏమి యిట్లు భూమిపై నాల్గుప్రక్కలఁ జిమ్మఁబడినట్లు పడియున్నవి? (రెండడుగులు పెట్టి) ఇవియే పుష్పహారములు. నేలంబడిక్రందియున్నవి. (చక్కఁగాఁజూచి) నా ప్రియురా లిందుఁ బడియున్నదే. ఏమిది?

ఉ. మాసినచీరఁ జుట్టుకొని♦మానితభూషణరాజి భూమిపై
వేసరిపాఱవైచి కను♦విందును గూర్చెడు పూలహారముల్
గాసిలునట్లువైచి కొఱ♦గాని మహాకఠినంపునేలపై
నీసరణిం బరుండుటకు♦నేమికతంబో యెఱుంగ నక్కటా. 4

సీ. ననుఁగాంచినంతనే♦ఘనహర్ష మలరంగఁ
జనుదెంచి పల్కులఁ♦దనియఁజేయు
నింతసే పేభార్య♦యింటనుంటివొ యిపు
డైన రాఁ గూడెనా♦యనుచు నవ్వ
వచ్చినదే నాకుఁ♦బదివేలవరహాలు
చాలు నం చని పల్కి♦కేలి సేయు
జ్ఞాపక మున్నదా♦చాన యి దొక్కటె
నాభార్యయని మీకు♦నాథ యనును
బల్కరించును లాలించుఁ♦బంతమూనుఁ
గేళిఁ దేలించు నవ్వించుఁ♦గిలిగిలింత
లట్టెకల్గించు మరియాద♦లుట్టిపడఁగ
నన్నుఁ బ్రేమించు చుండు నీ♦యన్నుమిన్న. 5

ఇపుడేలొకో యీగతిఁ బట్టినది. పల్కరించదు గాక. (అనికూరుచుండి యామెశిరస్సు తనతొడపై నుంచుకొని చెక్కిళులు నవ్వుచుఁ గన్నీరునించుచు) నానోముల ఫలమా, ప్రాణేశ్వరీ! ఒక్కమాటు పల్కుమా.

కైక:—(వెక్కివెక్కి యేడ్చును.)

దశ:—ప్రాణప్రియా, కైకా! ఏల యిట్లేడ్చెదవే. ఏటి కీపరితాపము నీకు హఠాత్తుగాఁ గల్గినదే. నాతోడు. ఆలస్యముచేయక మాటలాడి నాకుఁ బ్రాణదానము చేయుము.

కైక:—(మఱింతగా నేడ్చును.)

దశ:—(బుజ్జగించుచు) కాంతారత్నమా! ఏలయేడ్చెదవు? నాకుఁ దెల్పుము. నన్నుఁ బరిణయమైనప్పటినుండి యొక్కనాఁడైన నీకంట నీరు గ్రమ్మలేదే. ఇపుడేల యిట్లుకుంది వందురుచున్నావు. తెల్పుమా. నాప్రాణములు మీఁదివి మీఁదికే పోవుచున్నవే లలనామణీ! ఇంక నాలస్యముచేసిన నీకు బ్రహ్మహత్యకన్న నెక్కుడు పాపము సంభవించుఁ జుమీ, (అనిముద్దిడుకొనును)

కైక:—(కన్నీరుమున్నీరుగాఁ గార్చును)

దశ:—ఇయ్యో! యీకన్నీటిప్రవాహము నీకపకారముం జేసిన యెవని ముంప నున్నదో.

క. తరుణీ నీకపకృతి నే
నరుఁ డొనరిచె వానిపేరు నాకుం జెప్పుమా
కరిపదములఁ ద్రొక్కించెద
సరగున నతఁ డెవ్వఁడైన నైనను జుమ్మీ. 6

అపకార మెవ్వఁడును జేయఁడేని నీకేమికావలయునో చెప్పుమా. ఎట్టికోరిక యైన ఫలింపఁ జేసెద.

చ. మనమున నేమికోరుదువొ మన్మతి దాని నెఱుంగఁగాని కో
రిన దిదియంచుఁ దెల్పినఁ గరిప్రియగామిని! ముజ్జగంబులం
గనఁబడు వస్తువేదయినఁ గాని జవంబునఁ దెచ్చి నీదుమ్రో
లను నిలుపంగఁ జాలుదు విలాపము మాని యెఱుంగఁ జెప్పుమా. 7

తరుణీమణీ! నారాణులలో నెవ్వరుగాని పుత్త్రులలో నెవరుగాని, నీకేమైన నపకారముచేసిరా చెప్పుమా. విడువక వారినైన దండించెద. దుఃఖింపక యొక్క మాట మెల్లఁగాఁ జెప్పుము. చూడు మవ్వల నాశక్తి.

కైక:—(కొంచెము మూల్గును)

దశ:—(తనలో) ఏడ్పు మానుచున్నట్లున్నది. ఇంకనునమ్మకమును బుట్టించెదఁగాక. (ప్రకాశము) ప్రియురాలా!

చ. అపకృతి నీకొనర్చి క్షితియందు నధోభువనంబునందు స్వ
ర్గపురమునందు డాఁగినను గాంతరొ పూరుషుఁడేని గాంతయే
నిపుడె మదీయకోపశుచికింధనమౌ రఘురాముఁడేని నీ
యపకృతికిం ఫలంబుఁ గను నన్యుని మాట యిఁకేల చెప్పఁగన్. 8

ఇంతతో నీకు సంతృప్తిగాదేని,

క. వినుమా నామ ప్రతిజ్ఞను
దనయుండు మిత్రుండు మంత్రి దార యనక నీ
పనుపున దండించెదఁ ద
ప్పను రామునితోడు వేగ పల్కుము యింకన్. 9

కైక:—(కన్నీరు దుడుచుకొనును)

దశ:—బ్రదికితిరా తండ్రీ! కన్నీరు దుడుచుకొనుచున్నది. ఇఁక మాటలాడునేమో (ప్రకాశము) కైకా, ఏమి నీయిష్టము?

కైక:—(డగ్గుత్తికతో) నాకోరికఁ దీర్తునన్న మాట సత్యమా ?

దశ:—ప్రాణేశ్వరీ! రామునితోడని ప్రతిజ్ఞ చేసితినే. నాపుణ్యముతోడనికూడ నిపుడు ప్రతిన చేయుచున్నాను.

కైక:—చెప్పినతర్వాత నేదో యొకయడ్డు చెప్పిన ?

దశ:—చేలా. అంతసంశయమా. విను.

చ. జననము ఖ్యాతిచే వెలయు సద్రఘువంశమునందుఁ దండ్రియో
వినుతిని గన్న యాయజుఁడు విశ్వ మెఱుంగు మదీయచిత్తవృ
త్తిని దగుణేసునే యిటు క్షితిఁ యశ మొందిన నేను మాటఁ ద
ప్పిన నగరే మహాజనులు పెంపిఁకఁ దక్కునె వేయునేటికిన్. 10

చ. మనమున నీకు నింక నను మానము గల్గినచోఁ బ్రతిజ్ఞ నే
నొనరుతు నీదుకోరిక నుహోద్యమసాధ్యమయ్యెనఁ దీర్తుఁ ద
ప్పిన రఘువంశసద్యశముఁ బెంపును బోవఁగఁ బుణ్యవార్ధి యిం
కను నరకంబునం బడుదుఁ గాంతరో చెప్పుము నమ్ము నానుడిన్. 11

కైక:—(కన్నీరు చక్కఁగాఁ దుడుచుకొని) ప్రాణేశ్వరా! రఘువంశజులు అసత్యమాడువారు కారు. మీరింతకుముం దెప్పుడును జెప్పియుండలేదు. ఈసంగతి నేనెఱుంగుదు. ఐనను నాకోరిక మిమ్ము సత్యవాదిగాఁ జేయునంతటిది. కాననే యిన్నిపర్యాయములు పట్టుదలగా నడిగితిని. రామునిపైఁ బుణ్యముపై నొట్టుపెట్టుకొంటిరి. ఇఁకఁ జెప్పెద. సావధానముగా వినుఁడు.

దశ:—చక్కఁగా వినియెద. త్వరగాఁ జెప్పి నామనోవైకల్యము దీర్పుము.

కైక:—

తే. సురలు ప్రార్థింప శంబరాసురునితోడ
సంగరముచేయఁ బోవుచు శాతశరశ

శాసనంబులు ధరియించి♦యోసుగాత్రి
నమ్ము నను గూర్చి ధీరవై ♦రణము చూడ. 12

అనిపిలిచితిరి గదా.

దశ — అవును. పిలిచితిని. ఎవరు లేదన్నారు ?

కైక:— అసల నామహాసురుని మూర్ఛోని యోపినంతవిక్రమంబు చూపి మూడవ నాలుగుపర్యాయము లతని రెండుముండం జేసితిరి గదా.

దశ:— సరే, ఇపు డాసంగరము నాయెదుట జరగినట్లే యున్నది. ఆనాడు.

చ. దనుజుని ఘోరసాయకవి♦తానముహార్తుని మూర్ఛితుండ నన్
వనితరో దూరభూమికి జ♦వంబున సారథిలేమి నీవె స్యం
దనమును దోలి కాచితివి♦ధైర్యము మీఱఁగ

కైక:— ఇంతయేని మీ
మనమునఁ దోఁచెఁ జాలు నృప♦సుందర శ్రీరఘువంశభూషణా. 13

దశ:— తరువాత ?

కైక:— అట్లు రెండుపర్యాయములు మీరు మూర్ఛిల్లుటయు, నేనపతలికి రథముఁ దోలుటయు జరగెను గదా. దానిమఱచిపోరు గదా !

దశ:— సత్యమే. నాఁడు నీసాయమే లేకయున్న నాగతి యేమయియుండునో.

కైక:— రెండవపర్యాయముఁ గూడ రథము దూరముగాఁ గొనిపోయినతర్వాత మూర్ఛదేఱి మీరు నన్నాదరించి యప్పటియుపకారమునకుం గడు నానందించి,

క. కోనుమిచ్చెద వరయుగ్మం
బును దరుణీ యంచుఁ బ్రమద♦మునఁ బల్కితి రా
ననుఁ జు నిజంబని మీమది
కిని దోఁచినయట్లులైనఁ♦గీర్తికలాపా. 14

దశ:— (స్మరణమభినయించి)

చ. తరుణిరో లేదనన్ వశమె♦తావకమైన మహోపకారమున్
మరణము నొందువేళఁ గని♦మంటిని నీవట లేకయున్న సం
గరమున నేమియౌదు నొకో♦కావున నీయుపకార మెన్నియు
వ్వరయుగ మెన్న సామ్య మొక♦భంగిని నైనఁ గనంగ రాదు సూ. 15

కైక:— నాథా ! అట్లు తెమరు వరయుగ్మంబు దయచేయ వలసినప్పుడడిగెదనంటిని జ్ఞాపకమున్నదా.

దశ:—(స్మరణమభినయించి) నిశ్చయమే.

కైక:—ఇంతదనుక నేనేమియును నడుగలేదు కదా.

దశ:—లేదు.

కైక:—ఇపు డడుగఁ దలఁచితిని.

దశ:—(వామాక్షిస్పందన ముపలక్షించితనలో) ఏలనాయెడమక న్నదరుచున్నది? వామభుజము కూడఁ జలించుచున్నదే. ఏటికో; ముదుసలితనమున కివిలక్షణములు కాఁబోలు. (అనియాలోచించుచుండును).

కైక:—ఏమట్లూరకున్నారు?

దశ:—ప్రాణేశ్వరీ! మ రేమియుఁ గాదు. ఇన్నిపర్యాయము లడుగవచ్చునా అడుగవచ్చునాయని ప్రశ్నింపనేల? అని విచారించుచున్నాను. అడుగుము; సందియ మొందనేల?

కైక:—ఇపుడు రామునభిషేకింపఁ బ్రయత్నము చేసినారుకదా.

దశ—ఆశుభవార్త నీకుఁజెప్పుటకే వచ్చినాఁడఁ జుమీ.

కైక:—మంచిదేకాని నావరములమాట వినిపించెద.

దశ:—తడవేల?

కైక:—తప్పక యీయవలయును.

దశ:—అయ్యో; ఎంత వెఱ్ఱిదానవే. అడుగుము. వెంటనే నెఱవేర్చెద.

కైక:—

క. నారచీరలుగట్టి వ♦నంబులందు
రాఘవుఁడు పదునాల్గువ♦ర్షంబు లుండఁ
దగును భరతుండు రాజయి♦ధరణి నేల
వలయు నివి రెండు నాకోరు♦వరము లధిప. 16

దశ:—(నిశ్చేష్టుఁడై యుండును.)

కైక:—ఏమూర కున్నారు?

దశ:—(దిక్కుతోఁచకయుండును)

కైక:—(వీఁపుతట్టి) ప్రాణేశా! సత్యకీర్తీ, నావరములవిని యూరకున్నారేమి?

దశ:—(మాటాడఁబోయిపలుకురామినూరకుండును)

కైక:—రఘువంశమండనా, సత్యవ్రతా? ఏమిమాటాడకున్నారు?

దశ:—(ఏమో చెప్పఁబోవును)

కైక:—మాట వినరాలేదే.

దశ:—(పెదవులాడించును)

కైక:—నాకర్థము కాలేదు. ఏమాకపటము ?

దశ:—(డగ్గుత్తికతో) నే నెందున్నవాఁడ ?

కైక:—ఏమామాటలు ? కైకయంతఃపురములోనున్నారు.

దశ:—నాకేమియుఁ దోఁచలేదు కైకా !

కైక:—ఏమిసత్యసంధతయిది ?

దశ:—నాకర్థము కాలేదే.

కైక:—నేనుగోరినవరముల నిత్తుమంటిరి. అడిగితిని. ఏమియు మాటలాడక రేమెూ తోఁచనట్లున్నారే ? కారణమేమి? ఇది రఘువంశజనితులకు మర్యాదయగునా.

దశ.—ఏమడిగితివో. నాకు దిక్కేతోఁచలేదు.

కైక:—మరలఁ జెప్పెద (నారచీరలుగట్టి యనుపద్యమును మరలఁబఠించును)

దశ:—అడవులకు రామునిం బంపవలయుననియా.

కైక:—అవును.

దశ:—ఎందుకు ? (అనికన్నీరునించును)

కైక:—నివసించుటకు.

దశ:—అడవులలో రాముని నివసింపఁ బంపవలయునా,
అయ్యో ? (అనిమూర్ఛపోవును.)

కైక:—(శీతలోపచారములుచేసి) ప్రాణనాథా !

దశ:—(పలుకక దుఃఖించును)

కైక:—సత్యవాక్యపరిపాలనమునకుఁ దమరి నుదాహరణముగాలోకు లిఁకఁ దీసికొందురు కాఁబోలు ?

దశ:—అయ్యో ! కైకా ! దురాత్మురాలా ! రాముఁ డడవుల కేలపోవలయును ?

కైక:—నిజమాడెదరా లేదా.

దశ:—రాముఁ డడవులకు ?

కైక:—అవును. అడవులకే పోవలయు.

దశ:—పోయి ?

కైక:—నారచీరలుగట్టి పదునాలుగేండ్లు మునివృత్తి నుండవలయును. నాకొడుకు భరతుఁడు రాజ్య మేలవలయు.

దశ:—(బోరునవిలపించుచు) పాపిష్ఠురాలా, పాషాణహృదయా, రాముఁ డేమిని -కపకారము చేసినాఁడే.

కైక:—ఆమాట లటుండనిండు. ఇక్ష్వాకుకులమునఁ బుట్టి యీపలు కాడితప్పిన రాజులు లేరు.

దశ:—రామా, రామా, (అనిమూర్ఛిల్లును)

కైక:—(మూర్ఛఁదేర్చి) ఏమిసత్యమండీ, రామునితోడని యొట్టుపెట్టుకొని యింత లోనే యబద్ధ మాడునట్లున్నదే. (అనియేడ్చును)

దశ:—నీసత్యము మండిపోను, నీవరము లేటిపాలుగాను. నేరామచంద్రునిఁ బంపఁ గలనా, కైకా, చల్లనినీటిలో నాగొంతు కోసితివే.

కైక:—లోకులునన్నుఁ జూచి యిఁక సత్యము నేర్చుకొందురుగాక. ఇఁక నేనుండ నొల్ల, ఇదిగో యిపుడే పోయి సరయువులోఁబడి ప్రాణములు విడిచెద. రాము నితోఁ గూడి చల్లఁగానుండుఁడు.

దశ:—రాముఁ డడవిలోఁ బదునాలుగేం డ్లుండవలయునా.

కైక:—ఉండియే తీరవలయు, నారచీరలు గట్టుకొనవలయు.

దశ:—అయ్యో! రాక్షసీ! ఏమివరములు కోరితివే. కలయందైన నీవిట్టిదానవని తలపోయనైతినే పాపిష్ఠురాలా!

కైక:—మహీపాలక! తమరింత సత్యవాక్యపరిపాలకులని స్వప్నమందైనను నేను దలంపలేదు.

దశ!—పరమేశ్వరా! నేనేమిచేయఁగలను? నారాము నెట్లడవులకుంబంపుదును?

కైక:—రాముని బంపవలదుగాని నేనువరముల నీయలేదనుఁడు. చాలు. నేఁబోయి యేటిలోఁ బడియెద.

దశ:—కటకటా! కైకా, ఈవరములను గోర నినోరెట్లాడెనే, రామచంద్రుఁడు నీకేమైన నపకారము చేసి యెఱుఁగఁడు కదా. రాముఁడు సుగుణాభిరాముఁడని నీవే నాతోఁ బెక్కుపర్యాయములు చెప్పితివికదా

కైక:—చెప్పితిని గాని వరములడుగనని యేమైనఁ జెప్పియుంటినా.

దశ:—ఇట్టివరములా,

కైక:—భూపాలకా, నాకు వరముల నేలయిచ్చితిరి? రామునితోడనియేల శపథము చేసితిరి? సత్యమును దప్పితినని యొకసారియనినఁ జాలు నేఁబోయెద.

దశ:—(కోపముతోఁబండ్లు గొఱుకుచు) దురాత్మురాలా, కఠినాత్మురాలా, పయో ముఖవిషకుంభమా, గోముఖవ్యాఘ్రిమా, రక్కసీ! లోకు లేమనుకొందురో యనిగూడ జంకులేదఁటే.

కైక:—పాపము, పురుషులు నిష్కపటులు, స్త్రీలు కపటస్వభావము గలవారు.

నిజమేకాని చెప్పినమాట చెల్లింతువా, లేదా, నీవుచెల్లింపకున్న నీరామునకుం బ్రీతిగా నీకనులముందఱ నురిపోసికొనిచచ్చెద.

దశ:—అయ్యో! రాకాసీ! ఇఁకనైనఁ బట్టినపట్టు వదలవే. ఇదె తలనీపాదములు సోఁక నమస్కరించెద. ఇంకేమైన నడుగుము. ఇచ్చెద, రాముని బాసి యర్ధక్షణ మైన జీవింపఁజాల, కైకా, నన్నుం జంపుకొందువా. కొంచె మాలోచించి చెప్పుము.

కైక:—రాజా, ఈమాటలు నాకు రావు. మీవంటివారికే తెలిసియుండును. ఆడి తప్పెదరా. రాము నడవికిం బంపి నాకొడుకును రాజును జేసెదరా.

దశ:—కైకా! నామాటవిను. భరతుని రాజునొనరించెదఁ గాని రాము నడవులకుఁ బంపఁ జాల, నన్నుఁ గడుముదుసలిని బలవంతముగాఁ జంపఁ బ్రయత్నింపకుమా, బ్రదికినన్నాళ్లు బ్రదుకబోను. ఈనాలుగైదుదినములు నన్ను దుఃఖముల పాలు సేయకుము, నా ప్రార్థనము చెల్లింపుము.

కైక:—మొదటివరము రాము నడవులకుం బంపుమని కోరినది. దానిఁ జెల్లించినఁ గదా రెండవవరముమాట.

దశ:—కైకా! మగల నామాటనే వల్లింపకుమా, ఇపుడే ప్రాణములుపోవును.

కైక:—రాజా! లోకులు నవ్వుదురు. రఘువంశమునఁ బుట్టిన నీవే యిట్లసత్యము లాడ నిఁక సత్యమేయగ్నిలోఁ బడిపోవునో, (గట్టిగా) ఓసూర్యచంద్రాదిగ్రహము లారా! దేవతలారా! దశరథుఁడువరముల నాకిత్తునన్నమాట వినియుందురు. ఇపుడు తప్పుచున్నాఁడు. సాక్షులుగ నుండుఁడు. రాజా! "అంతఃప్రచ్ఛన్న పాపానాంశాస్తా వైవస్వతో యమః" అన్న న్యాయోక్తి మఱువకుము.

దశ:—కఠినాత్మురాలా! గట్టిగా మాటాడకుము. నిన్నిదే వేఁడుకొనియెద, నమస్కరించెద, ఆమాట మరల ననకుండుమా.

కైక:—ఇఁక నిన్నిమాటలు నాకేల? ఆడినమాటను జెల్లింతురా? తప్పుదురా? ఒక్కమాట చెప్పుఁడు?

దశ:—రాము నడవులకుఁ బొమ్మనుటతప్ప నింకేమైన నడుగుము కాదనకయిచ్చెద రామునింబాసి జీవింపఁజాల. తరువాత నీసౌభాగ్యమేముండును?

కైక:—సత్యము నిలుపుకొనఁ దలఁచినారా ఆమాట లీమాటలు చెప్పి కాలము పుచ్చఁదలఁచినారా.

దశ:—కైకా! ఆమాట నోటరానీయకుమా, నమస్కరించెద. రాముఁడు, అడవి—ఈ రెండుమాటలు జోడించి మాటలాడితివా నేనుయమపురికిఁ బోయెదఁజుమీ?

కైక:—(మహాగ్రహముతో) సత్యమా లోకములో నశించుఁగాక, ధర్మమనుమాటయే లేకపోవుఁగాక. (ఎలుంగెత్తి) సూర్యభగవానుఁడా, నీకిఁకఁ బ్రోవరేమి లేదు. చంద్రుఁడా, నీయాగారము నశించినది. భూదేవతా! నీవిఁకఁ ద్వరలో నశింతువు. బ్రహ్మదేవుఁడా! నీసృష్టి యిఁక నిల్వఁజాలదు. వేదములారా! దశరథ మహారాజు మీకుఁ దిలోదకములిచ్చుచున్నాఁడు. ధర్మశాస్త్రములారా! మీ కిఁక సద్గతిరయ్యె, జగము మునిఁగినది. పోయినది. భస్మమైనది. (భూమిపైఁబడి దొర్లును)

దశ:—కైకా! నన్నుఁ గొంతకాలము బ్రదుకనియవే. కాఁటికిఁ గాళ్లుదాఁచుకొన్నప్పుడు నాకు సంతానము గల్గినదే. రామున కభిషేకముచేసి కన్నులారఁ జూడనియవే. (అని మ్రొక్కి వేఁడును)

కైక:—(చేతులుపైకెత్తి) ఓసత్యమా, నిన్ను నమ్మినవారికి మేలుగలదని వినియుంటిని. ఇపుడు నమ్మి నశించుచున్నాను.

దశ:—కైకా? గట్టిగా మాటలాడకుమా, నలుగురు వినిపోదురు. ఇంతగొంతు నీకుఁ గలదని యెన్నఁడు నెఱుఁగను జుమీ, పికవాణీ యనిపిల్చుచుంటినే. ఇపుడు నిర్ఘోషవాణీ యనవలయు నేమో, నన్ను బ్రదికించుకొమ్ము. మీతల్లి చీమలు మాటలాడుచుండఁగా నవ్వినభర్త నావిషయముచెప్పుమనఁగాఁ జెప్పినఁజత్తునని యతఁడెంత వేఁడినను విడువక చెప్పించెను. దాన నాతఁడు మృతినొందెను. నీవు నట్టే యపకీర్తిని బొందకుమా,

కైక:—తమ రట్టిసత్కీర్తిని బొఁదినఁ జాలును. నామాట యిఁకనేటికి? కైక పుడమిలో లేదనుకొనుఁడు. (అని లేవఁబోవును)

దశ:—(చేయిపట్టుకొని) కైకా, కైకా, నాప్రాణములు నిల్పుమా, రాము నూరనుండనిమ్మా, మఱేమియు నడుగను.

కైక:—రాముఁ డూరనున్న కైకయు భరతుఁడు నగ్నిలోఁ బడుదురు.

దశ:—అయ్యో! రాఘవా, నాకుఁ గుమారుఁడవుగ నీవేల కౌసల్య కడుపునఁబుట్టితివి? నాయనా, కైకకడుపునఁ బుట్టిన బాగుండునే.

కైక:—రాజా! ఇపుడేమనియెదరు? వరములఁ జెల్లింతు మనియెదరా. లేదందురా

దశ:—ఆమాటలు మరలఁ బ్రశ్నింపకుమా కైకా!

కైక:—అవఁగాఁ దాత్పర్యమేమి? మీరురాము నడవులకుం బంపుదురా, నేనేపంపుదునా,

దశ:—అట్టికూరకృత్యము నీవుచేయుటకుం దగినదానవు. నాతోఁ జెప్పకుమా యామాట.

కైక:—(తనలో) ఇఁక నితనిఁ బల్కరించి లాభములేదు. చమత్కారమున నీవు చేయు మాపని నని యీతనినోటఁ జెప్పించితిని. రామునిం బిలువనంపి నేనే చెప్పెదను. అతఁడు పితృభక్తుఁడు. బదులు మాటలాడక పోవును (ప్రకాశము) అయితే నేనే యాపనిఁజేసెద.

దశ:—రామా, రామభద్రా, రామచంద్రా, రఘుకులమండనా, సుగుణాభిరామా, (అనిమూర్ఛిల్లును.)

కైక:—(తనలో) ఇదియేసమయము. రామునిం బిలిపించెద.

(ఇంతలో సుమంత్రుఁడు కైకనగరు ప్రవేశించును)

సుమం:—(తనలో) మహారాజుగారు రేలాఁతో తెల్లవాఱినను గైకయిల్లు వెడలి రాలేదు. ముహూర్తము చేరువకు వచ్చుచున్నది. వసిష్ఠమునీంద్రులు త్వరపడు చున్నారు. శ్రీరాముఁ డుపవాసవ్రతము సలిపి సిద్ధముగ నున్నాఁడు. పరికరము లన్నియుఁ జక్కఁగాఁగూర్పఁ బడినవి. కైకతో మాటలాడుచు నీవిషయము నే మఱచిపోయెఁ గాఁబోలు? (ముందునడచి పద్మాక్షింగాంచి) నారాక రాజు గారికిం దెలుపుము.

పద్మా:—తెల్లవాఱినను లోపలనేయున్నారు. కనుఁగొని వచ్చెద (అనిలోనికిఁబోయి వచ్చి) మంత్రివర్యా! పోవచ్చును. (సుమంత్రుఁడులోపలికింబోవును) జయము జయము మహారాజుగారికి.

దశ:—(దుఃఖములోఁ బలుకలేక యూరకుండును)

కైక:—మంత్రిసత్తమా, భూపాలుఁడు రేయెల్ల నిద్రలేక యున్నాఁడు. త్వరగా రామునిం జూడవలయునని కోరుచున్నాఁడు. పిలుచుకొనిరమ్ము.

సుమం:—తల్లీ! యట్లే తోడ్కొనివచ్చెద.

(అనినిష్క్రమించిరామునిసౌధమునకుంబోవును.)

(రాముఁడు సీతతో మాటలాడుచుండ సుమంత్రుఁడు ప్రవేశించును)

సుమం:—జయము శ్రీరామచంద్రులకు,

రాము:—సుమంత్రా! కూరుచుండుము. (అని కనుసంజ్ఞతోఁ బీఠముచూపును)

సుమం:—(కూరుచుండి) నేనుమహారాజు గారికి ముహూర్తకాలము సమీపించినదని విన్నవింపఁబోయి మనవిచేయఁగాఁ గైకమిమ్ముఁ జూడఁద్వరపడుచు బిలుచుచున్నది తెలిపెను.

రాము:—ఇదిగో వచ్చెద.

సుమం:—రథము సిద్ధముగనున్నది.

రాము:—(రథము నారోహించి సుమంత్రునింగాంచి) సుమంత్రా! ముందు చూడుము.

క. గరుడుండు సవ్యేతరముగఁ
దిరుగుచు నశుభంబుమనకుఁ దెలిపెడుఁ గాకుల్
వరుసఁ వాపోయెడు భీ
కరముగ నేడ్చెడి నభంబుఁ గనుచు శునకముల్. 17

సుమం:—పురాంతరమున నిట్టిశకునములు ఫలింపవని పెద్దలు చెప్పఁగా వినియున్న వాఁడను.

రాము:—తథాస్తు.

సుమం:—రథావతరణం బొనర్పుఁడు, రథమునిందే యునిచెద. ముహూర్తకాలము సమీపమునకు వచ్చుచున్నదనుమాటమాత్రము చిత్తమున నుంచవలయునని ప్రార్థించెద.

రాము:—అట్లే, త్వరగావచ్చెద.

(అని లోపలికిం బోవును)

కైక.—:(తనలో) రాముఁడు వచ్చుచున్నాఁడు. ముందు నావరములవిషయము నుజక్కఁగాఁ జెప్పి నేఁడే యడవులకుం బంపెద. భరతుఁడు వచ్చిన నాప్రయత్నము భంగమగును.

రాము:—(ప్రవేశించి తండ్రికిని దల్లికిని నమస్కరించి నిలువంబడి) తల్లీ! మాతండ్రిగారు విచారముతో నున్నట్లున్నది, ఏల?

కైక:—రామచంద్రా! నీవంటిసత్పుత్రుఁ డుండ విచారము పోవకుండునా.

రాము:—జననీ! నేను దీర్పఁదగినచింత తండ్రిగారికిం గల్గినఁ బ్రాణములనిచ్చియైనఁ దీర్పకుందునా.

కైక:—నాయనా, నీవంతటివాఁడవే, సంశయమేమి?

రాము.—ప్రియజనకా! తమరేల చింతఁ బూనవలయు? నాయొడలఁ బ్రాణములుండునంతదాఁక మీకేవిచారము గల్గఁగూడదని నాతలంపు.

దశ:—(కన్నీరు విడుచుచు నూరకుండును).

రాము:—తండ్రీ! మీరుకన్నీటిధారలచే భూమిని దడుపుచుండ నేనుజీవించిలాభమేమి?

దశ:—(క్రిందఁబడుచు దుఃఖించును)

**రాము:**—తండ్రీ! ఇదమిత్థమ్మని తెలియక నాచిత్తము కలవరపడుచున్నది.

కైక:—నాయనా! నేఁజెప్పెద నవధరింపుము.

**రాము:**—త్వరగా నాకుం దెల్పుము. ఇపుడే యీదుఃఖము తొలఁగునట్లుచేసెద.

కైక:—మఱేమియు గొప్పకార్యములేదు. నీవు సమ్మతించిన మీతండ్రి కృతార్థుఁడగును. నీవు సమ్మతింపవేని అసత్యపాశబద్ధుఁడై నశించును.

**రాము:**—(చెవులుమూసికొని) తల్లీ! ఎంతమాట చెప్పితివి? నేను సమ్మతింతునో లేదో యనుశంక మీకుఁ గలుగునంతకాలమువచ్చెఁగదా.

క. జననీ తెల్పెద శపథం
బును వినుమా తండ్రి చిత్తముఁ గల్గిన వాం
ఛను దీర్పనేని నారక
మునఁ బడుదుర్ సుకృతమెల్లఁ బోవ సతంబున్. 18

క. విను మింతియెగాదు మనం
బున నీవేకోరుదేనిఁ బూని యొనరుతున్
జననీ; తప్పను రఘుకుల
మునఁ బుట్టితిఁ గాన శీఘ్రముఁ దెల్పఁ దగున్. 19

కైక:—రామా; రఘుకుల ప్రఖ్యాతి నిరుపమానము. అది నీవంటి సజ్జనునిసాయమున విస్తరిల్లవలయు. ఇంకఁ జెప్పెదవిను. విచారము మనస్సునఁజొన్పకుము.

సీ. మీతండ్రి భూరిసంగ్రామకంబునన్ రాక్షసుల బారిఁ జిక్కినఁ దలఘుసత్వ
మేపారఁ గాచితి నేమును దానికై వరయుగ్మ మిచ్చెను వాని నిపుడు
కోరితి; వనములఁ గుంజనిపదునాలు గేండ్లీవు తాపసవృత్తి నుండ
భరతుఁడు రాజయి ధరణిని బాలింపఁ దగు నట్లొనర్పుమా ధరణినాథ

తే. యనుచు నేఁబల్కితిని, నిన్ను నడవి కేగు మనుచుఁ జెప్ప నేమందువో యనెడుశంక

నొంది పలుకక యున్నవాఁ ♦ డోకుమార
సత్యశపథుని జేయుమా ♦ జనకు నీవు. 20

రామా. పలుక కున్నాఁడ వేమి ?

రాము—(చిఱునవ్వు నవ్వును)

కైక—రామా. "పలుకకున్నఁ బదిపనులగు" నన్న యర్థంబు నవలంబించితివా యేమి. సత్యమును గాపాడెదవో, సత్యమే భూమిని లేకయుండఁ జేసెదవో నీయిష్టము.

రాము—తల్లీ! ఊరకున్నందులకుఁ గారణము మఱేమియును లేదు. ఇంకొక రీతి నాలోచింపకుము.

చ. ధరణిభరంబు నీసుతుఁడె ♦ తాల్చును నేను చతుర్దశాబ్దముల్ !
వరమునివృత్తిఁ గానన ని♦వాసము చేసెద సమ్మదంబునన్:
వరయుగ మిట్టులైన ఫల♦వంతమగుం గద శంక దీనికే
ధరణిపుఁ డొందనేల? వెతఁ ♦ దల్లడ మొందఁగనేల? యక్కటా! 21

తల్లీ ! ఈస్వల్పకార్యము నాకాజ్ఞాపింప నాతండ్రి సందియమందునట్లు తటస్థించెఁ గదా యని చింతిల్లెద. నీపాదములాన యిపుడే ప్రయాణమయ్యెద. (అని తండ్రిఁ గాంచి) తండ్రీ ?

సీ. వనమునఁ బదునాల్గు♦వర్షంబు లుండుట
దారుణంబని నీవుఁ ♦ దలఁప వలదు
పట్టంబు నీకు నేఁ ♦ గట్టెద రేపన్న
పలుకు పోయెనటంచుఁ ♦ దలఁప వలదు
చిన్నవానిని రాజుఁ ♦ జేసె నేమని ప్రజల్
పలుకరేయని మదిఁ ♦ దలఁప వలదు
నాతల్లి కౌసల్య ♦న్యాయమే యిదియని
పలుకునేమో యని ♦ తలఁప వలదు
తే. రాఘవుల కెల్లసత్యసం♦రక్షణంబె
పరమధర్మంబు గావున ♦ నిరతిఁ బూని
దానిఁ గాపాడుటయె స్థిర♦ధర్మమనుచు
నెమ్మదిఁ దలంపవయ్య యో♦నృపవరేణ్యా. 22

రఘువంశశిరోమణీ ! అస్థిరశరీరసుఖములకై సుస్థిరయశస్సత్యంబులను విడనాఁడనేల? మనంబునం దించుకంతయు విచారము నొనవలదు. ఇపుడు కూర్చిన వస్తువులతో

భరతున కభిషేక మొనరింపుము. జాగు సేయ నేల? భరతుఁ దోడ్కొని రమ్మని చారులం బంపుము. నేను వనముల కరుగ సిద్ధముగ నుందును. విచారింపవలదు.

కైక—(ఆత్మగతము.) రాముని తాత్పర్యము చూడ భరతుని రాకకై వేచియుండి తరువాత నడవికిఁ బ్రయాణమగునట్లున్నది. భరతుఁడువచ్చినా నాయత్నము వ్యర్థమేయగును. జాగుసేయక యిపుడే యీతని నడవులకు సాగనంపవలయు. (ప్రకాశము) రామా,

క. తొలివరము నీవు కానన
ములకరుగుట కనుచు భూప ♦ ముఖ్యు నడిగితిఁ
ఫలియింపవలయు నయ్యది
తొలుతనె యభిషేకము భర ♦ తున కగు నవలన్. 23

దశ—కటకటా! పాపాత్మురాలా! రాక్షసీ! (అని యేడ్చుచుమూర్ఛిల్లును)

రాము—(ఆత్మగతము)

చ. జనని వరద్వయంబుఁ బతి ♦ సాహసమూనుచుఁ గోరియుండు నా
తని కిది యుక్తమంచు మదిఁ ♦ దాఁకుటఁ బల్కక చింతనొందఁ దా
ననుఁ బిలిపించి స్వాశయము ♦ నాథుని దేయని తెల్పె నాకు నా
జనకుఁడు కానకేగుమనఁ ♦ జాలక యేడ్చుచు నంచుఁదోఁచెడున్. 24

ఇంతియేకాదు.

చ. భరతుఁడు వచ్చినం దనయు ♦ పాయము సాగదటంచు నీమె న
న్నరుగుము ముందు గానకని ♦ యాతురపెట్టెడుఁ దండ్రి దానికై
గురుతర దుఃఖ మొందెడినిఁ ♦ గొంకక వేగమె కానకేగెదన్.
భరతుఁడు వచ్చునవ్వలను ♦ బార్థివుదుఃఖము నంతశాంతిలున్. 25

హా! విధి యెంతబలవత్తరము ?

చ. కరగతమైనవస్తువును ♦ గన్పడకుండఁగఁ జేయు నొక్కెడన్
ధరణి లభింపరాని పనిఁ ♦ దాని లభింపఁగఁ జేయు నొక్కెడన్
సరియనరాని కార్యము య ♦ శంబున మించఁగఁ జేయు నొక్కెడన్
పరమతి నెన్ని చేయుపనిఁ ♦ బాడగునట్లుగఁ జేయునొక్కెడన్. 26

విధినెదిరించువాఁడు ప్రపంచమున లేనేలేఁడు. దానికిలోఁబడియే ప్రవర్తింపవలయు. నేనిపుడు విధికి నమస్కరించి తదాజ్ఞ శిరసావహించి చేసెద. (అని తల్లికి

నమస్కరించి) జననీ! నేనిపుడే యువవులకేగెద. మునివృత్తి నవలంబించెద. తమయానతి తండ్రియానతియు సమానమే.

కైకే—రామా! ఈసాయంకాలములోపలఁ బయనము కావలయు.

దశ—అయ్యో! పాషాణహృదయా, రాక్షసీ (అనియేడ్చుచు రాముని జూచును.)

రాము—తండ్రీ! దుఃఖింపఁ బనియేమి? కులక్రమాగతయశః కీర్తులం బాలింపుము. పదునాలుగేండ్లొక్కనిమేషముగా గడపివచ్చెద. తల్లీ! యింటికిం జనిపయనమై వచ్చెద. అడవికిం బోవునపుడుండఁదగుసాధనములను దెప్పించి యుంచుఁడు. ఇదె పోయివచ్చెద (అని నమస్కరించును.)

కైక—రామా! ఇకార్యముచే నీకనంత విఖ్యాతికలుగఁ గలదు. నీకీర్తి యాచంద్రతారార్కముగా నిల్వఁగలదు. విచారింపకు. నీచరిత్రము నెల్లరుఁ బాడఁగలరు.

రాము—తల్లీ! మీయాశీర్వాదములే చాలును. ఇవియే నాకనంత భాగ్యముల నొసంగఁ జాలును.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

పంచమాంకము సంపూర్ణము.

---

శ్రీరస్తు

# విచిత్ర పాదుకాపట్టాభిషేకము

## షష్ఠాంకము.

(ఖడ్గధారియై లక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

లక్ష్మ:—(మహాగ్రహముతో నాత్మగతము) కామాతురుఁడై రాజు ధర్మమునాలోచింపక యపమార్గమును బ్రవేశించినఁ బ్రాజ్ఞుఁడగు రాముఁడేల దానిని బాటింపవలయు? కైకకు వరములు రాజిచ్చెనఁట, సత్యమును దప్పఁగూడదఁట. నిన్నకొలువుకూటములో నందఱిముందఱ రామునకు రేపేయభిషేకోత్సవమని వచింపలేదా, అదితప్పిన సత్యభంగముకాదు కాఁబోలు. ఇఁకమంచిమాటలతో లాభములేదు. నేనే కరవాలము దీనిని జళిపించి పౌరుషముచేఁ గార్యమును సాధించెద. రామునకుఁ బట్టముగట్టెద. (చూడ్కి నిగుడించి) అదిగో సుమంత్రుఁడు వచ్చుచున్నాఁడు. మాటలాడెద. (అని ముందుకునడచి) సుమంత్రా! అక్కడివార్తలేమి?

సుమం:—వార్తలేవియున్నవి? అన్నియుఁ బూర్తినొందినవి. నారచీరలు తెమ్మని కైక యాజ్ఞాపింప వానినిదేఁ బోవుచున్నాను. (అనిదుఃఖించును)

లక్ష్మ:—(కోపముతో) సుమంత్రా! దుఃఖింపకుము. నారచీరలు తెమ్మని కైక యుత్తరువుచేసినదా, సెబాసు, వినునామాట.

చ. నరపతి యాజ్ఞ చేసినను♦నాఘుని ప్రీతికిఁ బాత్రభూతనై
పరఁగెడుదాన నేనని య♦భవ్యపథంబుననే చరించుచుం
గరువమునొందియున్న యల♦కైకవచించిన సాగనీయ ని
త్తరుణమునందు నేనె గుణ♦ధన్యుని రాముని రాజుఁ జేసెదన్.
ఇంకొక్కమాట చెప్పెద వినుము.

కం. కరవాల మిదియె దక్షిణ
కరమున నాకనుఁగుమిత్ర♦కల్పకముగ ని
త్తరుణమునఁ గ్రాలుచున్నది
పరికింపుము కార్యమెట్టి♦భంగిఁ దిరుగునో.

జోడుగఁబడి కైక నారచీరలు తెమ్మని యాజ్ఞ సేసినదియా, ఔరా? యెంత క్రూరకృత్యము? రాముఁ డోడ్కొని రమ్ము. పట్టాభిషేక మొనరింతము.

సుమం:—లక్ష్మణా! నీయూహ మంచిదేగాని రాముఁడంగీకరించినఁ గదా సాగును? మనమిప్పుడు ముందు శ్రీరాముని దర్శించి మాటలాడుదము. తరువాతఁ జేయఁదగినట్లు చేయవచ్చును. త్వరపడిన లాభమేమి?

లక్ష్మ:—మంచిదే, రాముఁ డెందున్నాఁడు?

సుమం:—కౌసల్యయింటికిఁ బోయి యామెకీవృత్తాంతమును జెప్పి సీతకీవార్తఁ దెలుపనరిగియున్నాఁడు.

లక్ష్మ:—ఏమీ, కౌసల్య యంగీకరించినదా, అక్కడివార్తలఁ జెప్పుము.

సుమం:—లక్ష్మణా! రాముఁ డీవార్త నెఱిఁగింపఁ బోవునప్పటి కామె కులదైవములఁ బూజించుచుండినది. రాముఁడు నమస్కరించి పిడుగువంటి యీవార్తఁ దెల్పఁగనే యట్లే పడిపోయినది.

లక్ష్మ:—తల్లీ క్రిందఁ బడకుము. నేనున్నవాఁడ (అని యఱచును)

సుమం:—లక్ష్మణా! ఇదేమి? కౌసల్యయేదీ యిక్కడ? నీవాగ్రహవ్యగ్రమనస్కుఁడ వౌట నిందే యప్పని జరుగుచున్నట్లూహించితివా యేమి?

లక్ష్మ:—(లజ్జనొంది) నిశ్చయమే సుమంత్రా! తరువాత?

సుమం:—రాముఁ డాశ్వాసింపఁ దెలిసి రామునిఁ గౌఁగిలించుకొని పలవించినది. రాముఁ డామె నూఱడించి భర్త్రాజ్ఞ మీఱరాదని చక్కఁగా బోధచేసి తుదకుఁ దానడవి కేగుటకు సమ్మతింపంజేసెను. ఆమెయాశిషములఁ బడసి సీత యింటి కరిగినాఁడు.

లక్ష్మ:—(కరవాలమును గ్రుంద వైచి) ఇఁక నామాట యెట్లు సాగును? కార్యమప్పుడే మీఱిపోయినదే, సుమంత్రా! ఇఁక నాగతి యేమి? నేనును రామునిం గూడి కానల కేగెద, రాముని పాదములం బట్టుకొని ప్రార్థించి యనుమతిఁ బడసెద. (అని నిష్క్రమించును)

(తరువాత రాముఁడు సీత భవనమును బ్రవేశించును.)

రాము—(తనలో) నాప్రేయసి నారాకకై యువ్విళ్లూరుచుండును. నేను బోయి పిడుగువంటి యీమాటను జెప్పఁగనే యేమగునో, సీతచిత్తము పేశలము. భయంకర వార్తను దీనిని విని కుప్పగూలునేమో, ఎట్లు చెప్పిన నామెమనస్సు కలఁగుండు నడకుండునో యట్లు చెప్పవలయును. (ఆకాశమునకుఁ జూడ్కి నిగుడించి) సరే! ఇప్పటి కీయుక్తి సరిపోవునట్లున్నది. చెప్పెదఁగాక. (అని లోపలికిం బోవును)

సీత:—(ఎదురొక్కి పూజించి కూర్చుండఁజేసి) ప్రాణేశ్వరా! మీరాక నాకొక శంక సంకురింపఁజేయుచున్నదే, ఏల?

రాము:—ప్రియసీ! నీకేకాదు, నాకు నొకశంక గలిగియేయున్నది.

సీత:—మీశంకకుఁ గారణమేమి?

రాము.—నీకుసంశయముదయింప హేతువేమి?

సీత:—

సీ. పట్టపేనుఁగు దివ్య♦భర్మభూషణముల
నలరి రావలదె ని♦న్నాశ్రయించి
భవ్యసితచ్ఛత్ర♦వరము స్వచ్ఛాయ ని
న్నలరఁ జేయుచును రా♦వలదె వెంటఁ
జారుతరాకృతి ♦ చామరద్వయము పా
ర్శ్వంబుల నుండఁగా ♦ వలదె మించి
రత్నకాంచనమయ ♦ రథము నీ వెక్కంగ
రమ్యతరంబుగ ♦ రావలదె
యిన్నియును లేక కాల్నడ ♦ నిప్పుడు నీవు
వచ్చుటకు హేతువేమొకో ♦ వదలకుండఁ
బల్కుమా చిత్తము త్తల ♦ పాటుఁగాంచు
చున్న దో ప్రాణనాయకా ♦ సన్నుతగుణ. 3

ఇంతియగాదు.

చ. చరణసరోజయుగ్మమున♦ఁ జొక్కలి రేఁగినధూళి గ్రమ్మియు
త్తరుణమునందుఁ గన్పడెడు♦దల్లడమందెడు నాననంబు భూ
వరుఁడగువేళ నిట్లునఁగు♦వందగు నంచును శాస్త్రమున్నదో
పరమకృపార్ద్రచిత్త! తగు♦భంగిని నాకు నెఱుంగఁజెప్పుమా. 4

రాము:—(చిఱునవ్వు మోమునఁ జిందులాడ) ఔరా! ఇట్లేల త్వరపడి శంకనొంది దిగులుపడియెదవు?

సీత:—నాథా! ధీరులగు మీకువలె నోర్పు నావంటి భీరువున కెట్లుండును? కాన నాయాన యాలసింపక చెప్పినా వెతమాన్పుము.

రాము:—

చ. తనువిది చంచలంబు ధన♦ధాన్యముఖంబులు మించులట్టు లో
కనిముసమైన నిల్వక♦యె కాలుగదల్చుచుఁ బోవుచుండు నే

మని యీఁకవీని నమ్మఁదగు♦హర్షమునొందుట యెట్లు సత్యమే
యనిశము నిల్చు ధర్మములు♦నట్టివె సుమాను విదేహరాట్సుతా.

సీత—నాథా! ఇపుడేందులకో యీవేదాంతవాక్యములు? నానెతలమాన్ప నివి యిపుడు పనికిరావే.

రాము:—(నవ్వుచు) ప్రేయసీ! త్వరపడకుము. పట్టపేనుఁగు శ్వేతచ్ఛత్రచామరములు రథము మొదలగునవి రాకయున్న నేమి లోపమనిచెప్పితిని. గౌరవము నిలుపుకొనవలయునన్న ధర్మమునాచరించుచు సత్యమును గాపాడుకొనవలెఁగదా.

సీత:—సరే. అమీఁద?

రాము:—నేనిపుడు పుత్రధర్మము నెఱపం బూని యున్నవాఁడను.

సీత:—అదియే నాకోరికయు. కాఁబట్టియే రాజార్హములగు గజాదులు రాలేదే యని ప్రశ్నించితి.

రాము:—రాజార్హములు గజాదులుకావు. సత్యధర్మములనియే చెప్పితిని.

సీత:—సత్యధర్మములు రాజార్హములనియే నాతాత్పర్యముకూడ. అయితే గజాదులు పట్టాభిషేకసాధనములుకదా.

రాము:—అవును.

సీత:—మఱియవేవి?

రాము:—ముందు ధర్మసత్యముల యథావిధి ననుష్ఠించినతర్వాత భద్రగజాదులు కావలెను.

సీత:—ప్రాణేశా! ఈమాటలయర్థము నాకు బోధపడలేదు. ప్రకృతపుఁ బనియేది?

రాము:—సత్యధర్మసంరక్షణమే.

సీత:—అందులకేకదా పట్టాభిషేకము.

రాము:—అందులకుఁ బట్టాభిషేకమే ముఖ్యముగాదు.

సీత:—మఱేదిముఖ్యము.

రాము:—అట్లడుగుము చెప్పెద పితృవాక్యమును మాతృవాక్యమును బరిపాలించుట ముఖ్యము,

సీత:—కాదని యెవరన్నారు? ఆప్రస్తావ మిపుడేల? నేఁటిదినమున జరగవలసిన పని యేది?

రాము:—పితృమాతృవాక్యపాలనమే.

సీత:—ఏవి వారి వాక్యములు?

రాము:—(నవ్వుచు) ప్రాణేశ్వరీ! చక్కఁగా నాలకింపుము.

చం. జనకుని ప్రాణరక్షణము, చక్కఁగఁ జేసినదంట కైకము
న్ననిమొన; దానికై జనకుఁ, డామెకు రెండువరంబు లెంతొ ప్రీ
తినఁగరి యిచ్చెనంట, యవి తెమ్మని కైకయు వేఁడెనంట, యం
దు నొకవరంబు తీఱ భరతుం డగునంట; నృపాలుఁ డింతిరో. 6

సీత:—(ఇంచుక యోజించి నిట్టూర్పు నిగుడించి) హా! వసిష్ఠమునిచంద్రా! మీరు పెట్టిన ముహూర్తము మాకు విపరీతఫలము నిచ్చెఁగదా. ఉపవాసఫల మొక్కటియే మాకుఁ దక్కినది. హా. రాజ్యలక్ష్మీ! నీ వెందఱినో కోరుచుండుదానవు కదా. ఇంతలో రామచంద్రు నిపదలి భరతునిం గోరితివా.

రాము:—ప్రేయసీ, విచారింపకుము. ఇది సంతోషవార్తయే యని తలంపుము.

సీత:—నాథా! భరతాభిషేకము నోర్వక పల్కినదానఁగాను. విధిచేష్ట లెట్లు మార్పు నొందునో తెలియదుగదా యని యూహించి యిట్లు పల్కితిని కానిండు. విచార మేల? ఒకవరమునకు ఫలమిట్లాయె. రెండవవరమునకు ఫలమెట్టిది?

రాము:—అది నీకుఁ దెలుపఁదగినది కాదు. అవల నీకే తెలియఁగలదు.

సీత:—నాకుఁ దెలుపఁగూడని వార్తయొకటి నీకుఁ గలదని యిపుడే నేను వింటిని?

రాము:—తెలుపఁ గూడదనఁగా నిపుడే నేనేల చెప్పవలయునని గాని యితరము గాదు.

సీత:—నేనేల చెప్పవలయు ననఁగా నింకొకరిద్వారా తెలియఁగలదని కదా మీ భావము. అదియుక్తమని మీకుఁ దోఁచినదేమో.

రాము:—(ఆలోచించి) యుక్తము కాదుగాని నేనే చెప్పిన నిపుడే నీమన స్సుత్తల పాటొందునేమో యని భయపడుచున్నాఁడ.

సీత:—అంతభయము మీకేల? అశుభవార్త మీనోటినుండియే వినఁగోరుచున్నాను?

రాము:—నానోటనుండి వినుటయు నామాట ప్రకారము చేయుటయు నీకుఁ గర్తవ్యము.

సీత:—ప్రాణేశా! నేను మీకనపాయిని నిగదా. మీ రెట్లు చెప్పుదురో యెట్లు చేయుదురో నేనును దోడునీడవలె నట్లే చేయుచుండుదును.

రాము:—(ఆత్మగతము) సీత నేర్పున నన్నుమించునది. అప్పుడే ముందటికాళ్ళకు బంధాలు వేసినట్లు మాటలాడుచున్నదే. ముందేమిగతి? నా ప్రయాణ మెట్లు సాగును? కానీ! చెప్పిచూచెద (ప్రకాశము) ప్రాణేశ్వరీ! పతివ్రతాతిలకమా, విదేహరాజపుత్త్రీ!

చం. వనములకేగి నేను మునివర్యులవృత్తి సమాశ్రయించియుం
డను జనునంట, యందుఁ బదునాలుగువర్షము, లంతదాఁక నా

యనుజుఁడు రాజ్యమేలునఁట; యామెవచించిన దిట్లు నేనిదే
వనమునకేగఁ బూని మది వర్ధిలు ప్రీతిని జెప్పవచ్చితిన్. 7

సాధ్వీమణీ !

చం. వరయుగ మిట్లుకోరెఁ బ్రియభర్తను గేకయరాజపుత్త్రి, భూ
వరమణి యేమియున్ బదులు వల్కక యూరకయుండె నన్నునా
దరమునఁ బిల్వనంపి వని తామణియే యిటులాజ్ఞచేసె నా
వరములఁదీర్పకున్నఁ బితృ వాక్యము తప్పునుగాదెజానకీ. 8

సీత:—హావిధీ (అనిమూర్ఛపోవును).

రాము:—(లేవనెత్తి యంకసమాసీనఁగాఁ జేసి సేద తేర్చి) విదేహరాజపుత్త్రి ! ప్రాకృతునిభార్య చందమున రామపత్నివగు నీవిట్లుభీతిల్లెదవేల? అయ్యో! ఇట్లైన నాకుఁ గలధైర్య మేటిపాలగుఁగదా

సీత:—(కూరుచుండి) నాథా! పట్టాభిషేకోత్సవమునకు బదులు వనగమనోత్సవము చేయునట్లు తటస్థించెనా. ఏమి యీముహూర్తబలము? నిన్నరాత్రి దుస్స్వప్నములెన్నియో తోఁచినవి. అవియుపవాసాయాసమునఁ గలుగు చిత్తభ్రమములని తలంచితిని గాని యిట్లగునని యూహింపఁజాలనైతిని. నాథా ! నీకు వనగమనమా, కఠినాత్మురాలా, కైకా, నీకుమారునకుం బట్టముకట్టుమని కోరుదువుగాక. నాభర్త యడవులకుం బోవలయుననుటలో నీకులాభమేమి ? (అనిమరలమూర్ఛిల్లును)

రాము:—(కన్నీరుదుడుచుకొని) విదేహరాజనందనా.

చం. వనముల కేగువాఁడనని పల్కితిఁ గాని నినుం ద్యజించియేఁ
జననెటులోర్తు? నన్వదలఁ జాలవుగా కలనైన నిప్పుడే
వనికరుగంగ నబ్బరతు పాలనమం దెటులుందువొక్కొ ని
న్గనియెడు భాగ్యమింకఁ బదు నాలుగువర్షము లేగినం గదా. 9

సీత:—(కొంచెముస్మృతిరాఁగా) నాథా ! మనమిపుడేయడవియందున్నాము ?

రాము:—(తనలో) ఇపుడేవిభ్రాంతినొందినదే. అడవులలో నున్నట్లేతలంచుచున్నది. ఇంకనను బాసియుండునట్లు లేదు. కఠినంపుభూములకు నేనెట్లు పిలుచుకొని పోవఁ జాలుదు? కొంచెము బోధించిచూచెద ! (ప్రకాశము) ప్రాణేశ్వరీ! ఇది యరణ్యభాగముకాదు. మనయంతఃపురము. ఏల యిట్లు పలవరించుచున్నావు ?

సీత:—నాథా ! మన కంతఃపుర మింకనెక్కడిది? అరణ్యమధ్యభాగమేయంతఃపురము. మృగములే పరిచారకులు. తరుగుల్మములే విహారస్థలములు.

రాము:—నారీరత్నమా, నన్నువదలి యుందువు గాన నీకిదియరణ్యముగనే తోఁచును. నిజమే.

సీత:—ప్రాణేశా! ఏమంటిరి? మిమ్మువదలి యుందునా. ఏజన్మముననిట్లుంటిని ?

రాము:—సాధ్వీ ! పదునాలుగువర్షములు మునివృత్తి నుండవలయు ననఁగా నారచీరలు గట్టుకొని వనంబులనుండవలయునని తల్లియాజ్ఞ, పతియాజ్ఞ సతులకు ధర్మము. నా యాశయమురీతి నీవు మెలఁగవలయును.

సీత:—నాథా ! మీయానతి మీఱుదునని యేలయులికిపడియెదరు ?

రాము:—(సంతోషముతో) నీవిటనుండి నాతల్లి కుపచారములు సేయుచుండవలయు ననుటయే నాయాశయము.

సీత:—(కన్నీరువిడుచుచు) మనోవాక్కాయముల నీమాట సమ్మతమని చెప్పఁగలరా. శాస్త్రము లీమాట నంగీకరించునా, సహధర్మచారిణియనఁగా నర్థమేమి ? నన్ను వదలి యేవ్రతమాచరించు నధికారము మీకున్నది? కొంచెమాలోచించి మఱిమాట్లాడినమేలు.

రాము:—నీమాటలకు బదులాడ వీలుదొరకకున్నది. కాని యరణ్యములు దుర్గమములు. నీవచటికి రానోపవు.

సీత:—రామచంద్రా ! ఈమాటలు సీతతోఁ జెప్పఁదగునే.

చ. పతినెడఁబాసియున్నఁ బురి♦పాడుగదా సతి కాత్మనాథుసం
గతి నివసించు కాఱడవి♦కమ్రతరంబగు పత్తనంబెగా
సతతము ప్రాణనాయకుని♦సంగతి నుండుటె సాధ్విధర్మమా
వితమును మానదూష్యమని♦వేదవిదుల్ వచియింతు రెప్పుడున్. 10

దుర్గమారణ్యములయందు నిరర్గళవిహారము మిముంగూడి చేయుదాన. నేనేవిషయమునను భయంపడను. క్రూరములు, క్రూరతరములు, క్రూరతమములునగు మృగములకు జంకను. మీచెంతనుండునన్నుఁ గన్నెత్తిచూడ దేవదానవులకైన శక్యమే. దివ్యతమారణ్యములలో ముద్దులుగులుకు చిలుకలపలుకు లాలకించుచు నీచెంతనుండి సుఖించెద. సెలయేటి విమలోదకంబుల స్వేచ్ఛగామనమిరువురము విహరింపవచ్చునుగదా. ఇఁకఁ దడవుసేయక ప్రయాణము చేయుదము. మఱియొక్కపర్యాయము నన్నువదలునట్లు మీనోటనుండి మాటవచ్చెనా యిందె ప్రాణములు వదలెద. మీయాన.

రాము:—(ఆత్మగతము) ఇంకపలదనిన లాభము లేదు. నన్నువదలియుండఁ జాలదు. కఠినంపుభూముల నెట్లునడిపింతును ? ఏమియుఁ దోఁచకున్నది ? కలయందైనను

శ్రమములనెఱుఁగదు. ఎట్లుసంచరింపఁ జాలునో భగవంతునకే వేద్యము. (సీతం గాంచి) రామాలలామమా ఇఁక నేనేమనినిన్ను నివారింపఁగలను ? నీరాకకు సమ్మతించితి.

సీత:—(హర్షముతో రాముని చెంత కేగి) నాథా ! ఇఁక నేఁజేయవలసిన పనియేది ?

రాము:—సాధ్వీ ! నేనిఁక కైకయింటికింబోయి నారచీరలుధరించివచ్చెద. నీవు !

మత్తకోకిలములు.

ఘోరకాననసీమ నుండఁగఁ గోర్కెనొందెదు కావునన్
ధీరవై యికనీకుఁ దోఁచిన దివ్యభూషణవస్త్రముల్
ధారుణీసురవర్యులెల్ల నితాంతతృప్తిని బొందఁగాఁ
గోరినట్టు లొసంగుమా మదిఁ గొంకునొందకుమా సతీ. 11

సీత:—

సుంతయేనియుఁ గొంకులేదెద సూనృతం బిది నాయకా
సంతసంబున ధారుణీసుర సంతతిం బిలిపించి సౌ
ధాంతరంబునఁ గల్గు కాంచన హారిరత్నకలాపముల్
వింతగొల్ప నొసంగుదానను వేగపోదము కానకున్. 12

రాము:—

కానలో నివసించుటెంతయుఁ గష్టమంచుఁ దలంపకో
జానకీ ! యిదె వత్తునంచు విచారమింతయు లేకనా
తోను బల్కుచు నున్న దానవు ధూర్తులుందురు రాక్షసుల్
కాననఁ జక్కఁగనెంచి చేయుము కానకేగు ప్రయాణమున్.

సీత:—

మానసంబునఁ జక్కఁగాఁ బలుమాఱు లెంచియె రాఘవా
కానకున్ నినుఁగూడి రాఁదగుఁగాని యింటవసింప నీ
యాన కూడదటంచు నాఁడదియందు యోజనచేసి యే
నేనువచ్చెద నంచుఁ బల్కితి నిక్కమిద్ది త్రిశుద్ధిగన్. 14

రాము:—ప్రాణేశ్వరీ ! అరణ్యములం గలుగుకష్టములను జెప్పితి. చక్కఁగా నాలోచించుకొనుమంటిని. నీవెన్నివిధములచేతను వచ్చెదననుచున్నావు. నీరాక నంగీకరించితి పయనము గమ్ము.

సీత:—నాథా! 1మీయాజ్ఞయైనదియే పదివేలు. ఇంతకంటె నాకుఁ బ్రియమైనదేది యుండును? సర్వార్థములు ఫలించినట్లే యైనది. నాయందుఁ దమకుఁ గల సన్మానము విదితమైనది. నాకోరికలెల్లఁ గొనసాగినవి. నానోములు ఫలించినవి.

రాము:—ప్రేయసీ! 2నేనింకఁ గైకసౌధమునకుంబోయి యాటవిక వేషమును ధరించి వచ్చెద. నేవచ్చునంతలోపల నే చెప్పినట్లు నీవు కృత్యము లొనరించి యుండుము. అదియే నాకుం బ్రియతరమగు కార్యము.

సీత:—తమ సెలవుప్రకారము కార్యములన్నియు నెఱవేర్చియుండెద. మీరాకకై కాచియుండెద.

రాము:—ఇదె కైకయింటికిం బోయివచ్చెద. (చూడ్కి నిగుడించి) నాప్రియసోదరుఁడు లక్ష్మణుఁడు వచ్చుచున్నాఁడు. మాటలాడివెడలెద.

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ:—(రామునిపాదములపై వ్రాలి యేడ్చుచువిడువకుండును.)

రాము:—వత్సా! సౌమిత్రీ! ఏలయేడ్చెదవు? సంతోషకాలముగదా యిది.

లక్ష్మ:—(పాదములు పట్టుకొని విడువకుండును)

రాము:—నాయనా. లెమ్ము. నీవేమికోరిన నటు చేసెద.

లక్ష్మ:—(లేచి కన్నీరుదుడుచుకొనుచు) రామచంద్రా!

చ. వనములకేఁగువాఁడవఁట♦వచ్చెదనేనును నిన్నుఁగూడి చ
క్కనిపరిచర్య చేయుచును♦గ్రమ్మఱ నీవెనువెంటవత్తు నా
మనమునఁ గల్గువాంఛ యిది♦మానక తీర్చిన మేలు లేనిచో
నినుఁగనుచుం ద్యజించెదను♦నేనసువుల్ నిజమిప్పుడేయిటన్. 15

రాము:—నాయనా! అంతటితెగువకుం బూననేల? జానకియు నావెంటవచ్చును. నీవును రావచ్చును.

లక్ష్మ:—(సంతోషముతో) తండ్రీ! ఇదియె నాకోరిక. నెఱవేర్చితివి. పయనమయ్యెద.

రాము:—మనమిరువురము కైకయింటికిం బోయి వత్తము రమ్ము. మునివేషధారణము చేయవలయునఁట.

లక్ష్మ:—ఇదెవచ్చుచున్నాఁడ. త్వరగాఁ బోయివత్తము. మీవలెనే నేనును మునివేషమును ధరించెద. బదులుచెప్పక యనుమతింప వలయును.

---

1. మానాద్యాప్తిగలిగినట్లు చెప్పుటచే నిది భాషణము.

2. ఇష్టకార్యదర్శనమగుట నిది పూర్వభావము

రాము:—వత్సా? ఆవేషమందు నీకంతటివాంఛయున్న నేనేల వలదనియెదను. అట్లే ధరింపుము.

క. తనువులు రెండను భేదమె, మన సొక్కటియేతలంప•మనకిర్వురకో, యనుజా! విధియేర్పఱచెను, గనకుముసంశయముమేలు•గాంతువుదానన్.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

---

(పిదప దేవశర్మ సూర్యశర్మ లనునిరువురు విప్రులు ప్రవేశించుచున్నారు)

దేవ:—మిత్రమా! చూచితివా. మొన్ననేకదా మనము పౌరులకు రామాభిషేకను వార్తను జెప్పి సంతోషింపఁ జేసితిమి. అట్టిమనమే యిపుడు రాముఁడు నారచీరలు గట్టి తమ్మునితో భార్యతో నడవికిఁ బోవుచున్నాఁడను దుఃఖవార్తఁ జెప్పవలసి వచ్చినది.

సూర:్య—ఆర్యోత్తమా, రాముఁ డడవికిం బయనమగుట నిశ్చయమేనా.

దేవ:—ఇంకనుసంశయమా, ఇపుడే నారచీరలు కైకయింటికిం గొనిపోవుచుండఁగాఁ జూచివచ్చితిని. ఇఁక రామలక్ష్మణులు పోవుదురఁట. నారచీరలు కైకయే యందిచ్చునఁట. వారుధరింతురఁట, పౌరులెల్ల గుంపులుగుంపులుగాఁ గూడియున్నవారు.

సూర్య:—పండితేంద్రా! కులగురువగు వసిష్ఠముని వలదని యాక్షేపించలేదా.

దేవ:—వారియుపన్యాసమును వినుటకే నేనచటికిం బోయియుంటిని.

సూర్య:—వారేమనిచెప్పిరి?

దేవ:—కైకనుగాంచి యనరాని మాటలాడి నిందించిరి. న్యాయముగను, నిష్ఠురముగను నెంతచెప్పినను ససేమిరా యనుచుఁ దనపట్టును వదలినదికాదు. తుదకాయన యాగ్రహమున నెన్నియో మాటలాడిరి. కాని ఫలము రామారణ్యగమనమే.

సూర్య:—అయ్యో! ఇఁక మనగతియేమి?

దేవ:—మన కధోగతియే. అయోధ్య యిఁకఁబాడు. కోసలరాజ్యమే పాడు.

సూర్య:—(చూడ్కినిగుడించి) ఏమాకోలాహలము?

దేవ:—శ్రీరామలక్ష్మణులు కైకయింటికిఁ బోవుచున్నట్లున్నది. చూతమురమ్ము.

(అని నిష్క్రమింతురు)

---

(తరువాతఁ గైకయింట రామలక్ష్మణులు ప్రవేశింతురు)

రాము:—తల్లీ! నమస్కారములు.

కైక:—వత్సా! జననియాజ్ఞనొంది పితృవాక్యపరిపాలనము చేయవచ్చితివా,

వసి:—పితృవాక్యపరిపాలనముగాదు చేయవచ్చినది. రక్కసియగు కైకవాక్యపరిపాలనము చేయుటకు వచ్చినాఁడు.

రాము:—మునీంద్రా! యాగ్రహమేల? జననీవాక్యము జనకవాక్యతుల్యము. భేదమేమి?

కైక:—వత్సా! ఈనారచీరలు ధరించి పదునాలుగుసంవత్సరము లరణ్యవాసముచేసి న్యాయమును బాలించి రమ్ము. శాశ్వతకీర్తిని బొందుము.

వసి:—అయ్యో! పాపాత్మురాలా! ఈకఠినోక్తులాడ నీకు నోరెట్లాడినది?

దశ:—(బోరున నేడ్చుచు నూరకుండును)

రాము:—తల్లీ! మహాప్రసాదము. తమయాశీఃప్రభావమున నేఁబుట్టినందులకుఁ గావలసిన పనులన్నియు నెఱవేర్చి వచ్చెద. తమచేతితోనే నారచీర లిప్పింపుఁడు.

కైక:—మంథరా! నారచీర లిటు తెమ్మా.

మంథ:—ఇవియె నారచీరలు (అనియందిచ్చును)

కైక:—(నారచీరలు పుచ్చుకొని) వత్సా! రామచంద్రా! నీకీర్తి యాచంద్రార్కతారకముగా నిలుచుటకు నారచీరలు వీనిని గ్రహింపుము.

(అని చేతికిచ్చును.)

దశ:—పాపాత్మురాలా! రాక్షసీ! కైకా, కులపాంసనీ! (అని తిట్టుచు మూర్ఛిల్లును.)

వసి:—కేకయరాజకులమును జెఱుపఁ బుట్టినదానా. కైకా, ఈనారచీర లందిచ్చుటకు నీచేతు లెట్లాడెను? భరతుఁడు రాజ్యమేలునని యాశపడితివా, చూతము గాక. (అని పండ్లు పటపటలాడించును)

రాము:—తల్లీ! మహాప్రసాదము త్రికరణశుద్ధిగా వీనినే మృదుతమాంబరములుగా భావించి గ్రహించిధరించెద. (అని ధరించుచుండును.)

(ఆకాశమున ధ్వని.)

క. [1]సురలయభీష్టముపండఁగఁ, దరుణీమణివల్కలములఁ దానొసఁగగుణో
త్కరుఁ డగురాముఁడు వానిన్, ధరియింపఁగఁ జేసె నార ధాతస్వశక్తిన్.

రాము:—(తనలో) ఏమియీధ్వని? ఎచ్చటనుండియో విచిత్రముగా వినఁబడుచున్నది?

(అనికట్టుకొనును)

పౌరులు:—(తమలోఁదాము) ఏమిది? ఆశ్చర్యముగానున్నది! ఎవరుచెప్పిరో యని కనుఁగొనరాకుండ నీధ్వని బయలుదేరుచున్నది.

---

1. అద్భుతార్థప్రాప్తిరూపమగు నుపగూహనము.

లక్ష్మ:—తల్లీ! రామచంద్రునివెంటఁ బోవునాకును నారచీర లిప్పించిన ధరించెద.

కైక:—రాము నెనఁబాయని నీవిట్లడుగుట న్యాయమే. తెప్పించియిచ్చెద. (అని తెప్పించియిచ్చును)

లక్ష్మ:—తల్లీ! రాముఁ డడవులపాలయి నాతో సుఖముగాఁ గాలముగడపును గాక. భరతుఁడు సకలదుఃఖములపాలై పోవుఁగాక. (అని ధరించును.)

కైక:—వత్సా! రామభద్రా! ఇఁక నీవింటికిం బోఁగూడదు. ఇటనుండియే యడవికిం బోవలయును.

రాము:—తల్లీ! సీత నాతోవచ్చును. ఇంటికిం బోఁగూడదని యాజ్ఞాపించితిరి. ఇటకే పిలిపించుకొని పయనమయ్యెద.

కైక:—వత్సా! సీతను బిలిపించెద (అనిసుమంత్రునిజూచి) సుమంత్రా! సీతను దోడ్కొనిరమ్ము.

సుమం:—చిత్తము.

(అనినిష్క్రమించును)

---

(సీత కాలినడకతోఁ బ్రవేశించును.)

సీత:—(అత్తగారికి నమస్కరించి) భర్తవెంటఁ బోవుటకై మీయనుమతిని గోరుచున్నాను. కరుణించి యనుజ్ఞయిండు.

కైక:—మంచిదమ్మా (అనిమంథరనుజూచి) మంథరా! మాజానకికి మెత్తనినారచీరలు తెమ్ము.

వసి:—(గద్గదముదువ్వుచు) ఏమేమీ, కఠినాత్మురాలా! కైకా, సీతకా నారచీరలు. నీవు వరములను గోరునప్పుడు సీతప్రస్తావము చేసితివా.

దశ:—(కన్నీరుదుడుచుకొని) ఈపాపాత్మురాలు నన్నడుగునపుడు జానకిమాటయే ప్రస్తావింపలేదు. కనుక నిపుడు నారచీర లీయఁగూడదు. నాముద్దులకోడలు సకలాభరణభూషితురాలై పోవలయును. రథముమొదలగు సాధనము లామెకు నే నిచ్చితిని.

కైక:—రామునివెంటఁ బోవువారందఱును మునివృత్తినుండవలయుననియే నాభావము. అప్పుడడుగకున్నను అడిగినట్లే యనుకొనవచ్చును.

దశ:—(మహోగ్రహముతో)

చ. వరముల నిచ్చినాఁడనని•పల్కకు స్వేచ్ఛఁగ సత్యరూప బం
ధురతరపాశబద్ధుఁడను•ద్రోయ్యలి కావున నిస్సుఁజంప కి
త్తరుణమునందు మానితిని•ధాత్రికుమారిక నోవ్వఁ జేయు దేఁ
గరిపదసన్నిపాతమునఁ•గ్రన్నన నీతల వ్రక్కలించెదన్.

వశి:—వరములడుగునపుడు సీతాలక్ష్మణుల ప్రస్తావమే లేదుకదా. లక్ష్మణుఁడు కోరియే నారచీరలు ధరించెను. సీతయేల ధరింపవలయు ?

దశ:—జనకరాజేంద్రతనయా, నాముద్దులకోడలా, తల్లీ, యిటు రమ్ము. సకలాభరణాలంకృతవై పతివెంట నరుగుము. (అనియొసఁగుచును)

సీత:—(మామగారికినమస్కరించినిలువంబడును)

దశ:—(సీతను జూచుచు) తల్లీ !

క. వనజదళాక్షుని నవప్రాయునిన్నియు సిరినేలయు నట్టుంతయుఁ బ్రీతిన్
జనవినుతుని శ్రీరాముని,జనకసుతా కూడియుండఁ జాలుదు వెపుడున్.

సీత:—మామగారి యాజ్ఞయు నావ్రతము నే స్థిరపఱచుచున్నది. సెలవుగైకొనియెద. (కైకకునమస్కరించి) అత్తగారూ !

చ. వనములకిప్పుడేగెదను భర్తను గూడి చతుర్దశాబ్దముల్
చనినయనంతరంబ రఘుచంద్రుని గూడి యయోధ్య కేగుదెం
తును గృప నాశిషంబులిడి కోరకు వేసట మాండవింబలెన్
ననుఁ దలపోయఁగాఁ దగును నాయపరాధము లుజ్జగించుచున్. 20

కైక:—మంచిది.

దశ:—భూపుత్రీ! సాధ్వీమణీ !

క. కులముద్ధరించు నాకోడలనీవు మనోజ్ఞగుణపటలభూషితవి
మ్ములనీదుకీర్తి జగములఁ గలయన్ వ్యాపించి వెలయుఁ గాకసతంబున్.

(ఆకాశమునధ్వని.)

క. సురకార్యము ఫలియించెడు, తరుణంబిది యాశిషములు దశరథవిభుఁడ
క్కరణి నొసంగెను భళిరే, ధరణీభారంబు తొలఁగు ధాత్రియునలరున్.

వసిష్ఠాదులు:—(నలుదిక్కులుపరికించుచు) ఏమియీశబ్దము ? ఎందుండివచ్చెనో, ఏదియో దీనియర్థము.

రాము:—జనకా! జననీ! గురువర్యా! పౌరులారా ! అందఱియొద్దను సెలవు గైకొనుచున్నాను. పునర్దర్శనంబు తఱి సర్వవృత్తాంతములను దలపోసికొందము.

(అని సీతాలక్ష్మణులతో నిష్క్రమించును)

షష్ఠాంకము సంపూర్ణము.

శ్రీరస్తు

# విచిత్రపాదుకాపట్టాభిషేకము

---

## సప్తమాంకము.

(భరతుఁడు నిద్రతూఁగుతో నొంటిగాఁ బ్రవేశించుచున్నాఁడు)

భర:—(ఆత్మగతము) మూఁడురాత్రులనుండి దుస్స్వప్నములే వచ్చుచున్నవి. నేఁడు ఘోరాతిఘోరములగు కలలువచ్చినవి. అయోధ్య పాడువడియున్నయట్లగపడుట కుంగారణమేమి? తల్లులుముగ్గురు విధవలై యున్నట్లు స్వప్నమునఁ దోఁచినదే, ఏల? ఇట్టికలలెప్పుడును నాకు రాలేదు. ఏమోశాపమునిఁగియుండును. నాతల్లి క్రూరస్వభావురాలు. ఏది నిశ్చయించుటకును నాకిపుడు తోఁచకున్నది. పరుండుదమన్న నిద్రరాదు. (వామాక్షిస్పందనము నిరూపించి) అయ్యో! ఈ దృష్టాంతముగూడ రాఁబోవు చెడుఫలమునే సూచించుచున్నది. ఉపశ్రుతినిబరీక్షించెద. (అని గవాక్షముకడ నిలువఁబడి చెవియొగ్గియుండును.)

(వీథిలో భార్యాభర్తలు కలహించుచుందురు.)

భర్త:—ఓసీపాపాత్మురాలా! నీమాటను నమ్మి తండ్రినింగోలుపోతిని. సోదరులు దూరమైరి. అపకీర్తిలోకమున నల్లుకొనుచున్నది. నీముఖము చూడఁగూడదు. పాపము వచ్చును.

భార్య:—పాపమురానీ, పుణ్యమురానీ, నాపట్టువదలను. అయితీరవలెను.

భర్త:—ఓసీ! కఠినాత్మురాలా! ఏలనాప్రాణములు తీయఁబూనెదవే. ఇంకనైన నీప్రయత్నము మానవే.

భార్య:—నీప్రాణముపోనీ, పోకపోనీ; నామాటచెల్లియే తీరవలయు.

(అనిలోపలికింబోవును.)

భర:—(ఆలకించి) కటకటా! ఉపశ్రుతికూడ దుష్ఫలమునే బోధించుచున్నది. రే మాట వినఁబడునో. (ఆకాశమువైపుచూడ్కి నిగుడించి) శుక్రోదయమైఁ తెల్లవాఱులక్షణములు కనఁబడుచున్నవి. నాల్గవయామమునఁదోఁచిన ఫలించునని పెద్దలుచెప్పుచుండఁగా వినియున్నాఁడను. (కుక్కుటధ్వని

కుక్కుటములు కూయుచున్నవి. సాంధ్యరాగము ప్రాగ్దిక్కున వ్యాపించుచున్నది ఇఁక లేచి కాలోచితకృత్యములనుదీర్చి భగవంతునిధ్యానించెద. వత్సా! శత్రుఘ్నా, ప్రతిదినము లేచునట్లేల యీదినము నిద్ర లేవవు? (శత్రుఘ్నుఁడు పలవరించును) నాయనా! ఏమి కాపలవరించుచున్నావు.

శత్రు:—(మేల్కాంచి) అన్నా! దారుణస్వప్నము వచ్చినది.

భర:—(దగ్గరికితో) ఏమిరా నాయనా! ఆస్వప్నము?

శత్రు:—అన్నగారూ!

తే. తండ్రి తలపట్టి భీకర ♦ దనుజకాంత
యీడ్చినట్లుగఁదల్లులెం♦ తేవగలను
బొగులుచున్నట్లుగ నయోధ్య ♦ పొలుపుమాని
పాడునడియుండునట్లు స్వ♦ప్నమునఁగంటి. 1

భర:—అక్కటా! నాకునట్లే స్వప్నమునఁ దోఁచినది. వత్సా! తెల్లవారుచున్నది. ఎట్టి వార్త విననగునో.

(ద్వారపాలుఁడు ప్రవేశించును.)

ద్వార:—జయము జయము మహారాజపుత్రులకు.

శత్రు:—ఏమివార్త తెచ్చితివి?

ద్వార:—దేవరా! అయోధ్యనుండి దూతలువచ్చి కాచియున్నారు. ఏమి సెలవు?

శత్రు:—త్వరగా రమ్మనుము.

ద్వార:—చిత్తము (అనినిష్క్రమించును)

(పిమ్మట నిరువురు దూతలు ప్రవేశింతురు.)

దూత:—(కానుకలు ముందుపెట్టి) జయము భరతమహారాజుగారికి.

భర:—ఏమి యీకానుకలు.

ప్రథ:—మేనమామగారికిప్పించుటకుఁ బంపఁబడినవి.

భర:—ఏమియీయుదయమునసే వచ్చినారు. మీ మోములు మార్గశ్రమమున బడలినట్టున్నవి. ఇంతత్వరగా రాఁగారణంబేమి?

ద్వితీ:—వసిష్ఠమునియు సుమంత్రాదులును గొన్నికార్యములు మీవలననిప్పుడే జరగవలసియున్నవి కావునఁ ద్వరగాఁబిలుచుకొని రాఁదగునని పంపినారు.

భర:—తండ్రిగారు కుశలముగనున్నారా,

ప్రథ:—మమ్మిరువురను దటాలునఁ బిలిపించి యిప్పుడే బయలుదేరవలయునని యాజ్ఞాపించిరి. అప్పుడేబయలుదేరివచ్చితిమి,

భర:—(ఆత్మగతము) వీరిమాటల ధోరణి వేఱురీతిగానున్నది. ఒకదానికింకొకటిగా నుత్తరమునిచ్చుచున్నది. కాని! (ప్రకాశము) పుర మెట్లున్నది?

ద్వితీ:—పురమంతయు ముందలంకరింపఁబడియుండెను. ఇపుడుండవలసినట్లేయున్నది.

శత్రు:—ఏమియిట్లు బదులిచ్చుచున్నారు?

ప్రథ:—రేయింబవళ్లు పయనము చేసి యాయాసపడి వచ్చినాము. మామనస్సులు కలవిలపాటొందియున్నవి.

భర:—మాయన్న రామచంద్రుఁడు లక్ష్మణసహితుఁడై కుశలముగనున్నాఁడా.

ద్వితీ—సీతాలక్ష్మణులతో నపూర్వవైభవంబున నారామముల స్వేచ్ఛగానున్నట్లు వింటిమి, వెంటనే వచ్చితిమి.

భర:—ప్రతివాక్యము నామనస్సును దత్తఱపాటొందించుచున్నది. అట్లుండనీ, ఇపుడు నేనేమి చేయవలయు?

ఇరువురు:—ఇపుడే పయనము చేయవలయును.

భర:—మీరు ప్రయాణమగుచున్నపుడు వసిష్ఠాదులేమి చేయుచుండిరి.? ఇంత వేగముగా మమ్ము రమ్మననేల?

ప్రథ:—ఏమో గొప్పకార్యము నాలోచించుచున్నట్లు మాకుఁదోఁచినది. సావకాశముగా మమ్ము మాట్లాడనియలేదు. త్వరసేసిరి, వచ్చితిమి.

భర:—వత్సా! శత్రుఘ్నా! ప్రయాణము చేయవలయు ఇప్పుడే. (అని యందఱు నిష్క్రమింతురు)

(రాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యమునఁ బ్రవేశించును.)

రాము:—సుమంత్రా! రాత్రి నదీతీరమునఁ బౌరులు నిద్రించుచుండ మోసపుచ్చి వచ్చితిమి. వారెంతదుఃఖించుచుందురో.

సుమం:—ప్రభుకుమారా! ఆదుఃఖమునకుఁ బరిమితి యుండునే.

రాము:—(దృష్టిసారించి) సారథీ! ఆవచ్చువారెవరు? సేనతో వచ్చుచున్నట్లున్నది. వారిరూపములు భయంకరములుగా నున్నవే.

సుమం:—మహాత్మా! నిషాదాధిపతియగు గుహుఁడు వచ్చుచున్నట్లున్నది.

(సపరివారుఁడై గుహుఁడు ప్రవేశించును.)

గుహు:—మహాత్మా! రామచంద్రా! శృంగిబేరపురపరిపాలకుండగు గుహుఁడు నమస్కరించుచున్నాఁడు.

రాము:—నిషాదరాజా! మీయాగమనము సంతోషదాయకము. ఈయరణ్యముల మీరే మాకుఁ బ్రియబంధువులు.

గుహు:—మేము మీదాసులము. మానగరము మీది. దయచేసి మాయాతిథ్యము నంగీకరింపవలయు.

రాము:—ప్రియబంధూ! వనయాత్రకై వచ్చితిని. పురములఁ జొరరాదు.

గుహు:—తమవనయాత్ర వినఁబడినది. మానగరము మహారణ్యమధ్యగతము. కాననమే. ప్రవేశింపవచ్చునని మనవి చేయుచున్నాను.

రాము:—ఐనను నియమోల్లంఘనమేల చేయవలయును? తాపసవృత్తియే యిప్పటిపని. ఇంటేయుండుము. మీరాజ్యమున నెందున్నను మీయింటనున్నట్లే.

గుహు:—మావిం దారగింపవలయు.

రాము:—మంచిది. కందమూలాదు లిపుడు మాకాహారములు. షడ్రసోపేతమగు భోజనము చేయఁగూడదని నియమము.

గుహు:—మే మాటవికులము. మాయాహారములు తఱచుగా మునిజనార్హములే. మీ కెయ్యదియిష్టమో నాకయ్యది సంతోషదాయకము. మాభూముల నివసించినఁ జాలును.

రాము:—చాలదినము లుండరాదు. దేశనివాసము పనికిరాదు.

గుహు:—మీమాటల కడ్డము చెప్పునంతటి వాఁడనుగాను.

రాము:—మిత్రలక్షణ మిదియే. మీకన్న మాకుఁ బరమమిత్రులు దొరకరు.

గుహు:—ఇవిగో కందమూలాదులు పండి చక్కని భక్ష్యములుగ సిద్ధము చేయఁబడినవి. విందారగింపవలయు. ఈపర్ణకుటీరమున నివసింపవలయు. ఇదిగో కుశాస్తరణము. ఇదిగో తృణపల్లవ నిర్మితశయ్య. ఇవిగో విహారభూరుహములు.

రాము:—(అన్నింటిని పరికించి) మిత్రరత్నమా, ఇట్టిమనోహర పదార్థము లెన్నండును లభింపలేదు. తృప్తిమీఱ నారగించెద. సుఖముగా నివసించెద. విహరించెద. శయనించెద.

గుహు:—నాజన్మము నేఁటికి సఫలమైనది.

(రాముఁడు సీతాసహితుఁడై విందారగించును.)

లక్ష్మ:—నిషాదరాజా! మీఋణము దీర్చుకొనఁ జాలము. దివ్యహర్మ్యముల నివసించు రామచంద్రున కిపుడీ తృణశయ్యయింపుగానున్నదే. విధిచర్య యెంతబలవత్తరమో.

గుహు:—సౌమిత్రీ! చింతిల్లకుము. భగవద్యత్నము మాన్పరానిది. మరల మరలఁ దలంపవలదు. నీజన్మము సఫలము. అనవరత రామచంద్ర సేవాపరాయణుఁడవు.

ల:—తలఁపునకు వచ్చినప్పుడెల్ల దుఃఖసాగరమున మునుఁగుచుందును. ఈవిషయము తలంపునకు రాకుండ నట్టిదియా.

గుహు:—నిశ్చయమే కాని విచారించి లాభము లేదు. అదిగో రామచంద్రుఁడు విశ్రమించుచున్నట్లున్నది. నీవును బరుండుము. ఆయుధపాణినై నేనును నాపరిజనులును గావలియుందుము.

ల:—నాకును నిద్రకును గడుదూరము. రామచంద్రుఁడు తృణశయ్యఁ బరుండఁగాఁ జూచుచున్న నాకు నిద్రయెట్లు పట్టును?

గుహు?—సౌమిత్రీ! నీయందుఁ గన్పట్టు భ్రాతృవాత్సల్యము పవాసనము. మనమిరువుర మల్లయింగుదీవృక్షము చెంత నాయుధపాణులమై రేయియెల్లఁ గాపాడుచుందుదము. ఇట్లు మీరీమహాటవుల శ్రమముల పాలగుచుండ నయోధ్యలో భరతుఁడు పట్టాభిషిక్తుఁడై రాజభోగముల ననుభవించుచున్నాఁడు కదా.

ల:—రేపోమాపో భరతుఁ డయోధ్యనుజేరును. తల్లికైకయుఁ దానును సంతోషమున నోలలాడుచుండఁగలరు.

గుహు:—ఇఁక శ్రీరామమూర్తి సుఖశయ్య నిద్రించు సమయముగ నున్నది. మనమిట నుండరాదు. దూరముగనుండి జాగరూకులమై చుట్టుతిరుగుచుఁ గాపాడుచుందము.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

(భరతుఁడు శత్రుఘ్నునితో దూతలతో నయోధ్యను బ్రవేశించుచున్నాఁడు.)

భర:—ప్రియానుజా! అయోధ్యను జూడఁగల్గితిమి. ఏలొకో యయోధ్య పాడుపడినట్లున్నది. గృధ్రములు హర్మ్యములపైఁ గూరుచుండి యున్నవి. పురమునుండి పొగరేఁగుచున్నది. కటకటా! ఏమి యీపురవర మిట్లుండుటకుఁ గారణము?

శత్రు.—అన్నగారూ! మనకేమో యశుభవార్త వినఁబడుననితోఁచుచున్నది. పురము ప్రవేశించుచున్నాము కదా!

భర:—సహోదరా! శత్రుఘ్నా! ఏమి యీవింత!

చ. పురజనులెల్ల నన్నుఁగని • పొక్కుచు మోములు విన్ననై తగన్
ద్వరపడుచుండ్రొ లంగిచను • వారు, గృహంబులు పాడువాఱె యి
త్తరుణమునందు దుఃఖమునె • తప్పక పొందినయట్లు కన్పడున్
బరిచరులైన నన్నుఁగని • పల్కక యూరకయున్నవారు సూ. 2

శత్రు:—రాజకుమారా! ఏదోయొక యశుభవార్త తప్పక వినవచ్చును. పురమున రామచంద్రుఁ డున్నట్లులేదు. అరాజకముగ రాజ్యమున్నప్పుడుండు లక్షణములు పురమునఁ గానఁబడుచున్నవి.

భర:—అదె తల్లిగారి సౌధము. త్వరగా రథావతరణముచేసి వార్త లరయుదము. (అని యిరువురు రథావతరణముచేసి సౌధముం బ్రవేశింతురు.)

భర:— తల్లీ! ఇవే నమస్కారములు (అని సాగిలంబడును.)

కైక:— (మహానందముతో లేవనెత్తి కౌఁగిటంజేర్చి) నాయనా! ఇతోధికమహావిభవములఁ బొందుము.

భర:— తల్లీ! తండ్రిగారెందున్నవారు? అన్నగారేమిచేయుచున్నారు?

కైక:— ఆవార్తలన్నియుఁ గ్రమముగా వినవచ్చును. ముందు జరపవలసినపనుల నిర్వహింపుము.

భర:— (కన్నీరుతో) తల్లీ! జనకులకుశల మరయుటకన్న ముందుచేఁ జేయఁదగిన కృత్యమెద్ది?

కైక:— ముద్దుకుమారా! వినుము వివరించి చెప్పెద.

సీ. శంబరాసురునితోఁ♦సంగ్రామమును జేయు
        తఱినిగాచితిని నీ♦తండ్రి, దాని
    కాతఁడు హర్షించి♦యడిగినయప్పుడే
        వరయుగళంబిచ్చు♦వాఁడననియె
    నీవులేనప్పుడు♦భూవిభుండే లోకో
        రామునకిచ్చెద♦రాజ్యమనుచు
    నభిషేకవస్తువు♦లన్నియుఁ గూర్పంగ
        వరముల నిమ్మంటి♦వానియందు

తే. నొకటఁ బదునాల్గు వర్షంబు♦లుగ్రవిపిన
    వాసమును జేయ రాముని ♦ బంపివైచి
    తిని మఱొక్కట నీరాజ్య ♦ మునకు నిన్నుఁ
    భట్టభద్రుని జేసెద♦ వైభవమున. 3

చ. జనకుఁడు, రామలక్ష్మణులు♦జానకియున్ మునివృత్తిఁ గానకుం
    జనిరని ప్రాణముల్ వదలెఁ♦జయ్యన రాజ్యము రాజకంబుగాఁ
    గనఁబడకుండఁ జేయఁదగుఁ♦గావున నాపలుకాదరించి నీ
    వనుపమరాజ్యభోగముల ♦ నందుముపొందుము గౌరవంబిలన్. 4

భర:— (మాటముగియ నంతలో మూర్ఛిల్లిపడును)

శత్రు:— (సేదదేర్చి) అన్నా! అనుకొననష్టమైనది. ఇఁక గతి యేమి?

భర:— (తల్లింజూచి యాగ్రహముతో) పాపాత్మురాలా! కులపాంసని! ఎట్టిపనిఁ జేసితివి?

చ. వనముల మౌనివృత్తి రఘు♦వర్యుని నుండఁగఁ జేసి భర్త ధ
ర్మనిలయవాస ముంగనెడు♦మాటికి నోర్చి మహామోదంబునం
గొనుము దెరాజ్యమంచు శోక♦కొంకును బొందక పల్కుచున్న ని
న్ననియసువుల్ భరింపఁగను♦గల్గితి నాజని యెంత నింద్యమో. 5

ఉ. తల్లివటన్న గౌరవము ♦ తప్పుమఱొక్కటి లేదు నీయెడన్
దల్లి వెకాకయున్న నిను ♦ దారుణఖడ్గము చేతఁబూనియ
ల్లల్లనఁ జీల్చిమాంసముల♦నాసురపాళియుఁ గంకగృధ్రముల్
పెల్లుగ నార్చుచుండినఁగఁ♦జేర్చినశక్తిని జేసియుండుదున్. 6

హాదుష్టరాక్షసీ! ఎంతక్రూరకార్యముచేసితివి? ఇక్ష్వాకు కేకయ సద్వంశముల కపకీర్తిం దెచ్చిపెట్టితివి. రాముని రాజ్యమును బరిగ్రహించు నంతటి క్రూరమతి నగుదునా. ఇట్లేలతలంచితివి? ఎవరు నీకీదుర్బోధము చేసిరి? వారింజెపుమా యిపుడె యమపురికింబంపెద. కట్టా! కులపాంసనీ! ఎట్టిపాపమున కొడిఁగట్టితివి?

చ. వనముల సీతఁగూడి రఘు♦వర్యుఁడు భోగములం దృజించి యిం
తనివచియింపరాని వెత♦నందిజటాజినముల్ ధరించి యుం
డనిచట దివ్యసౌధముల♦నాకసుఖంబుల మించుభోగముల్
గనఁగలనే? త్యజింతునసు♦కాండము నీక్షణమందె యిచ్చటన్. 7

(తమ్మునివంకఁజూచి) శత్రుఘ్నా! అగ్నిని బ్రణయింపుము. ఈపాడు శరీరమును దహించి నిర్మలుండ నయ్యెద. అయ్యో; అంతయాలస్యమేల? ఇప్పుడె యీకరవాలమున శిరస్సు ఛేదించుకొనియెద (అనిక త్తిదూసి మెడఁద్రెంచుకొనఁ బోవును.)

(వసిష్ఠుఁడు ప్రవేశించును.)

వసి:—కుమారా! వలదు వలదు. గుర్వాజ్ఞ. ఓర్చుకొను మోర్చుకొనుము.

భర:—అయ్యో! గుర్వాజ్ఞ యనుమాట వినఁబడియెనే. ఏమినాగతి (అనిచూచి) గురువర్యా! నమస్కారము. నాయందనుగ్రహము మీకుండిన.

ఆ. క్షణములోన నేను♦స్వర్గసీమను జేరఁ
జన ననుజ్ఞయిందు ♦ వనులనున్న
వాఁడురాముఁడనెడు♦పల్కును వినఁజాల
నిశ్చయంబు మేను ♦ నిలుపఁజాల. 8

క. జనకుఁడు సురపురి కేగెను
వనికేనుగె రామభూమి ♦ వల్లభుఁడనటా
తనువిది కాల్పనెయివ్విధి
ననటం బొందుచును నేను ♦ బ్రదుకఁగ నేలా.

వసి:—(ఖడ్గమును జేతఁబట్టుకొని) వత్సా! తెగువ కిదిసమయముకాదు. ముందుజనకునకు సంస్కారము చేయుము. పుత్రులు నల్వురుండియు నేడుదినములదాఁక సంస్కారము లేక దశరథమహారాజు దేహము తైలమునందుండుట ధర్మము కాదు. సత్పుత్రులు మీరిరువు రిప్పటికైనను వచ్చితిరి. తరువాతికార్యములు చూచుకొందము. త్వరపడుఁడు. తల్లిని నిందించిలాభములేదు. విధి బలవత్తరమని నమ్ముము. మంత్రులందఱును గాచియున్నవారు. రమ్ము

(అని భరతశత్రుఘ్నులతో నిష్క్రమించును)

---

{ రాముఁడు సీతాలక్ష్మణులతోఁ జిత్రకూటాద్రి సమీపకాంతారమును బ్రవేశించుచున్నాఁడు. }

రాము:—జానకీ! అరణ్యభూములు కర్కశములనియు, నీవు నడువఁజాలవనియుఁ జెప్పితిని. నీవామాట పాటించియున్న నంతఃపురముననుందువుకదా. అట్లుగాక పట్టుపట్టి నావెంటవచ్చితివి. అసుఖముల ననుభవింపుము.

సీత:—ప్రాణేశ్వరా, ఎవరికో చెప్పినట్లు సీత కిట్టిమాటలుపదేశింపఁబూనుట ధర్మమా, నేను నడువఁజాలనా, మీ రడవులలోనుండ నేనంతఃపురమున నుండవలయునా, ఇదియేనా మీ రుపదేశించుధర్మము.

రాము:—ప్రేయసీ! ధర్మము మాటయటుండనీ, నీయవస్థ నిటుఁగన్నులారఁ జూచుచున్న నామనస్సు ఖేదపడుచున్నదే. అయ్యో!

సీ. పల్లవంబులమృదు ♦ త్వంబునోడించుసీ
పాదసరోజముల్ ♦ వాడెనేఁడు
లలితప్రతానసీ ♦ విలసనంబుహసించు
సుందరబాహువుల్ ♦ సొక్కెనేఁడు
సంపూర్ణరుచివెల్గు ♦ చందురునిందించు
కమనీయవదనంబు ♦ కందెనేఁడు
చంచలమృగనేత్ర ♦ చారుతఁబోనాడు
సురుచిరనయనముల్ ♦ సొక్కెనేఁడు

తే. కటకటా! దుర్గమంబయి ♦ కఠినమగుచు
సాధ్వసంబునుగూర్చు నీ♦యస్థలమున
నడచుచుంటివి దేహభూ♦నాథపుత్రి
జానకీ! యేమిపల్కుదు ♦ నేనునిపుడు. 10

ఇంతియేకాదు.

ఉ. కంటకపంక్తియందుఁ బడు ♦ కాలును మెల్లఁగ లేవనెత్తి చే
నంటిననేమిబాధగన ♦ నోనోయటంచుభయంబుచేత వె
న్నంటియెవచ్చులక్ష్మణున ♦ కైనను జెప్పక నాకుఁ దెల్పకే
కుంటుచువచ్చునిన్నుఁ గనఁ ♦ గుందదె చిత్తమిఁ కేమిపల్కుదున్. 11

మఱియు.

తే. గాలి యూపఁగలత వూన♦లోని వెనుక
కట్టెవచ్చుచు నీమోము♦నందుఁ బడిన
హస్తముల మెల్లఁగనె వాని ♦ నవలఁ ద్రోచు
చున్న నీ వెతగుందింప ♦ దోఁకెనన్ను. 12

సీత:— ప్రాణేశ్వరా! నన్నుఁ జూచినపుడు మీకుఁ గల్గువిచారమువకంటె మిమ్ముఁ జూచు నపుడు నాకుంగల్గుచున్న విచారము వేయిమడుంగు లెక్కువగ నన్ను బాధించుచున్నది.

రాము:— ఆమాటలుండనీ; ముందుమార్గ మెంతకఠినముగనుండునో మన మెఱుఁగము. ఇపుడే నడువఁజాలకున్నదానవే. ముందెట్లు నడువనేర్తువు?

సీత:— సూర్యుని ఛాయాదేవి యనుసరించునట్లు మిమ్మనుసరించి చక్కఁగా నడువఁగల నను దృఢవిశ్వాసము నాకుంగలదు. ఏవిధమగు సందియమును బొందకుఁడు.

రాము:— అన్నిసందియములను నీమృదువాక్కులే తీర్చుచున్నవి కాని వెనుకమరలి నీవైపు చూడ్కి నిగుడించినపుడు మరల నెన్నియో సంశయములు కలుగుచున్నవి.

సీత:— ఇంచుకంతయు సంశయింపక మార్గము చూపుచున్న నేనును విలాసముగ నడచి వచ్చెద. (ముందు చూచి) ప్రాణేశా! ఆపర్వతము పేరేమి?

రాము:— ప్రేయసీ! అదియే మనకు భరద్వాజమహర్షి గారుపదేశించిన చిత్రకూటాచలము. దానిచెంతనే మనము నివసింపఁబోవుచున్నాము. మిక్కిలి సమీపముననే చక్కనిపర్ణశాల నేర్పఱచుకొని యందుండుదము.

సీత:— పోనుపోను కాననము సాంద్రతరుసముదయమై భయంకరముగను, దుర్గమముగనున్నది. మార్గము కానరాకున్నదే.

రాము:—లక్ష్మణా. జానకి యిఁక నడువఁజాలదు. మార్గము సుగమముగాఁజేయవలయు. గొడ్డలిచేతికందిమ్ము. ఈతరుశాఖలఛేదించెద.

ల:—(గొడ్డలియందిచ్చును, రాముఁడు తరుశాఖలఛేదించును)

సీత:—రామచంద్రా! నేనునివలె గొడ్డలి చేతఁబూని చెట్లకొమ్మలు నఱుకవలసిన దురదృష్టము నీకుఁబట్టినదే. విధి నేమనుదును?

రాము:—ఈపని నాకానందము నిచ్చుచున్నది. నీవు రాఁజాలనను విచారముతప్ప నింకొక్క విచారము నాకులేదు.

ల:—రామచంద్రా! చిత్రకూటము చెంతనున్నది. ఈయేటియొడ్డుననే పర్ణశాలనిర్మించెద. ఇందునివసింతము.

రాము:—సోదరా! ఈ యేటియొడ్డు వాసయోగ్యముగానున్నది. చక్కని పర్ణశాల నిర్మింపుము. సీత కెట్టికష్టమునుఁగలుగరాదు.

ల:—మీరును జానకియును నీమఱ్ఱిచెట్టునీడ విశ్రమింపుఁడు, నేను బర్ణశాలనిర్మించెద. (అని పర్ణశాలఁగట్టును.)

రాము:—(సీతతోనందుఁబ్రవేశించి) జానకీ! ఈపర్ణశాల శాస్త్రోక్తముగ నిర్మింపఁబడినది. ఎంతసొగసుగానున్నది?

చ. జలకములాడుతావిదిగో ♦ శయ్యకుఁదావిదిగో ముదంబునన్
ఫలములమెక్కుతావిదిగో ♦ ధ్యానములూరఁగముచ్చటాడని
మ్ములఁదగుదివ్యవేదికను ♦ బొజ్జెడుతావిదిగో తలోదరీ
కలుగుసుఖంబులిచ్చటను ♦ గాపురముండిన నెల్లకాలమున్. 13

సీతా! ఈగండశిలపైఁ జక్కఁగాఁ గూరుచుండి యేటితరంగిణిని జూచుచుండిన సకల మనఃక్లేశములు నశింపకమానవు. లక్ష్మణుండెంత చక్కఁగా నిర్మించినాఁడు?

సీత:—ఎండలోఁగూడ నీదండనుండ సకలసుఖము లబ్బుచుండుననఁగానిఁకనిట్టి యుత్తమ పర్ణశాలనుండ నవిలభించుననుట యొకవింతయా.

రాము:—జానకీ! నీకుసుఖముగల్గిన నాకుఁబదివేలు. (తమ్మునింజూచి) లక్ష్మణా! ఇందునివసింతము. ఈయది మార్గముకాదు. ఎవ్వరునురాజాలరు. చిత్రకూటము చేరువనున్నది. వృక్షములు సందులేకుండఁ బెరిగియున్నవి. తీఁగజొంపము లల్లిల్లుచున్నవి. అడవినుండ, రాఁదగు కష్టము. లిచ్చటఁ దోఁచవనుట నిక్కము. ఇఁక వేవేగ యాహారము సమకూర్పుము. పర్ణశాలచేరువనున్న మూలంబులం గొని

రాఁజనదునుమీ. ఇచ్చటిమృగంబుల జోలికింబోవకుము. మననివాసమున నవిభీతి నొందఁగూడదు. నాయనా! సకలకష్టములు ననుఁగూడి పొందుదశ నీకుఁ బట్టినది.

(అని చింతించును)

ల:—రామచంద్రా! నినుఁగూడియున్న యీయరణ్యమే నాకు స్వర్గముగనున్నది. అయోధ్యలో ననుభవించు సంతోషమునకన్న నిపుడు వేయిమడుంగుల సంతోష మనుభవించుచున్నాను.

(అనియందఱు నిష్క్రమింతురు.)

---

{ భరతుఁడు శత్రుఘ్నునితో వసిష్ఠాదులు వెంటరానరణ్యమును ప్రవేశించుచున్నాఁడు. }

భర:—వసిష్ఠమునివర్యా! ఈయరణ్యము పావనము. ఈమార్గముననే రామమూర్తి పోయియుండునా.

వసి:—ఇదెరథము జాడ కనఁబడుచున్నది. చూడుము. ఈత్రోవనే రాముఁడరిగి యుండవలయు. చెంతనే శృంగిబేరపురమున్నది, (ముందుచూచి) అదిగో గుహుఁడువచ్చుచున్నాఁడు. ఈతఁడు సుగుణవంతుఁడు. నిషాదాధిపతి. మీతండ్రికిం బరమమిత్రుఁడు.

(గుహుఁడు ప్రవేశించును)

గుహు:—రాజకుమారా? మునిచంద్రా! ఇదెనాయాతిథేయము. దీనింగైకొనుఁడు.

భర:—మీయాతిథేయ సత్కారమువా కెల్లర కమితానందమును గూర్చినది.

గుహు:—ఈవృక్షచ్ఛాయ నందఱు కూరుచుండుదురుగాక.

(అందఱు కూరుచుందురు)

భర:—నిషాదాధిపా! మీకందఱకుం గుశలంబే.

గుహు:—ఈయరణ్యములలో నిట్లున్నాము. ఒక్కమాట పల్కెద. ఉత్తరంబీ వలయు.

భర:—ఏమామాట?

గుహు:—అడవులపాలయి రామచంద్రుఁడు మునివృత్తినుండ నీచతురంగ బలముల తోఁబోనేల? మీయుద్దేశ్యమేమి?

భర—(నిట్టూర్పునిగుడించి) నిషాదరాజా! ఇట్టి యనుమానము నీమనస్సునకుం బోఁచునట్టి కాలమువచ్చినదికదా. (అని కన్నీరునించును.)

గుహు:—రాజకుమారా! ఎఱుఁగఁగోరియడిగితి. వేఱుగాఁ దలంపవలదు.

భర:—వసిష్ఠమునిచంద్రా! మీరుబదులు చెప్పి వసిష్ఠరరను ద్రృష్టికఱుదురుగాక

వసి:—నిషాదమహీపాలకా!

చ. వెలుఁగఁడు పాపమింతయును ♦ మహీపతిపుత్త్రుఁడు కైకయాత్మజుం
డటవిముఖేఁ జెందె నిప్పనికి ♦ నంచుఁ దలంపు మహానాధ్యఁ జేరియు
స్వాఅకెవగఁ వ్యాళిఁ గనిన ♦ వానివచాత్మజుఁ డంద్రిఁ ♦ గాంచియు
త్రటినోనరింపఁగాఁ దగిన ♦ తత్ప్రియ తెల్లను దీర్చె శ్రద్ధతోన్. 14

భర:—మునీంద్రా! తల్లి పేరుమాత్రము పలుకకున్న నానెత్తిన పాలుఁ పోసినట్లు.

గుహు:—అయ్యో! దశరథమహీపాల శిరోమణి సురలోకమునకుం బోయినాఁడా! హావిధీ (అని దుఃఖించును)

వసి:—రామభక్తా! వినుము. ఆమీఁదమే మెల్లరము రాజ్యమును బాలింపుమని యెన్నిపర్యాయములో యుపదేశించితిమి. కాని యమ్మాటలం బాటింపక యీ భరతుఁడు.

ఉ. ఒల్లను రాజ్యభోగముల ♦ నొల్లను దల్లిని నిత్తమున్ మనం
బుల్లసిలంగఁ జేయుసతి ♦ నొల్లఁ గిరీటము నింక నేమియో
నొల్ల రఘూత్తమాంఘ్రిసలి ♦ లోద్భవయుగ్మముఁ గొల్చుకాంక్ష నే
నెల్లవిధంబులన్ వనికి ♦ నేగెదఁ దాపసవృత్తిఁ బూనియే. 15

అనిపల్కెను.

గుహు:—(భరతుంజూచి) మునివృత్తినుండుట మొదట గుఱుతింపలేదు. అమీఁద?

వసి:—చతురంగ బలంబులం గూర్చుకొని తల్లులందోడ్కొని రామసందర్శనార్థమై.

గుహు:—(మాటకడ్డమువచ్చి) రాముని దర్శింపఁబోవుటకుఁ జతురంగబలము లేల?

వసి:—వత్సా! అట్లడుగుము. నీవు రామభక్తుఁడవని యెఱుఁగుదు. నీయీ ప్రశ్నము నకునాకు, నిందున్న యితరులకుఁ గోపమురాదు, విను.

చ. పురికరుదెంచి రాజ్యమును ♦ బూనుము జ్యేష్ఠుని దానుగాదె యి
ద్ధరణియటంచు వేఁడి తన ♦ ధర్మముఁ దీర్పఁగ భక్తిమీఱ సో
దరయుతుఁడై మముంగలిసి ♦ తాఁ జనుచున్ నినుఁ జూడవచ్చెనీ
భరతునియందు సుంతయును ♦ బాపము గల్గదు నిక్కమో గుహా. 16

గుహు—(పరమానందభరితుఁడై లేచి భరతుని కౌఁగిలించుకొని)

క. చరితార్థుఁడవే యైతివి
భరతా! నేనన్నమాట ♦ భావింపకుమే
పరుసను వేఱుగ నెఱుఁగక
త్వరపడి పల్కితిఁ క్షమింపఁ ♦ దగుఁ జుము నన్నున్. 17

భర:—రామచంద్రసఖా! నీవడుగఁ దగినదే నా ప్రవృత్తి యిట్లనుమానింపఁదగిన దైనట్లు కనఁబడుచున్నది. ఐనను నిజము నిలుకడమీఁదఁ దెలియఁగలదు.

గుహు:—రాజకుమారా! ఇఁక శ్రీరామచంద్రుని వృత్తాంతమును చెప్పెద. ఇందె రాముండు సీతయును శయనించిరి. లక్ష్మణుఁడు నేనును ఆల్లవృక్షము కడనుండి కావలి కాచితిమి. ఆవృక్షము కడనే జడలను వారుధరించిరి. ఈనదినిదాఁటి యాత్రోవనరిగిరి. ఇఁక నేమని చెప్పుదును. (అనిదుఃఖించును)

భర:—సోదరా:—ఇందఱిని దుఃఖములపాలు చేసినది పాపాత్మురాలు నాతల్లి.

గుహు:—ప్రభూ! ఆమెనిందించి లాభమేమి! ఈశ్వరేచ్ఛయిది.

భర:—నన్ను వేగమె తోడ్కొనిపోయి రామపాదములపైఁ ద్రోయుము.

గుహు:—రాజకుమారా! నేఁడిందువిడిసి నాయాతిథ్యంబుఁ జక్కఁగాఁబరిగ్రహించి రేపుదయము పయనము చేయుము. నేనువచ్చెద.

భర:—అట్లె యొనరించెద.

(అందఱు నిష్క్రమింతురు)

---

(సీతారామలక్ష్మణులు పర్ణశాలలో నుపవిష్టులై ప్రవేశించుచున్నారు.)

రాము:—ప్రియానుజా! లక్ష్మణా! అయోధ్యలో నిపుడేమిజరగుచుండునో భరతుఁడు తండ్రిగారి దుఃఖమును గొంత తీర్చియుండెడా.

ల:—రామచంద్రా! సుఖముగాఁ గైకయు భరతుఁడునుందురు. పట్టాభిషేకముజరగి యుండును. వారిప్రస్తావమిపుడు తేఁజనదు. నాయొడలు మండిపోవుచుండును.

రాము:—నాయనా! అట్లనంజనునే. ప్రియసోదరుఁడు కదా భరతుఁడు. అతని యందణుమాత్రమేని దోషముకనంబడదు.

ల:—ఈన్యాయమే మిమ్మిట్టిదశకుఁ దెచ్చినది.

రాము:—(చిఱునవ్వుతోఁ) వత్సా! అట్లనకుము. భరతుఁడు సోదరప్రీతికల వాఁడుసుమీ.

సీత:—నాథా! ఏలొకో మృగములు పరుగులిడుచున్నవి. పక్షులునలుదెసలకుంబాఱు చున్నవి. అరణ్యమందుఁ గోలాహలము వినఁబడుచున్నది.

రాము:—(దృష్టి సారించి) లక్ష్మణా! చాపము బాణములందిమ్ము. జానకీ! భయపడకుము. అరణ్యములో నివి సాధారణములే. లక్ష్మణా! చెట్టెక్కి నలుదెసలు పరికింపుము. వేటకాండ్రు ప్రవేశించియుందురా?

ల:—(శరశరాసనము లందిచ్చి చేరువనున్న వృక్షాగ్రము నెక్కి దెసలు పరికించి భర

వ్యాజముని యాశ్రమమువైపు చక్కఁగా నుపలక్షించి) అన్నా! రామచంద్రా! లెమ్ము. లెమ్ము. నడుముగట్టుము. చాపము సజ్యముచేసి యమోఘబాణంబులం గూర్పుము. మహాద్రోహి భరతుఁడు చతురంగబలములతో మనపైనెత్తివచ్చుచున్నాఁడు. నీసత్యమే నిన్నింతకుఁ దెచ్చినది.

రాము:—(నవ్వుచు) లక్ష్మణా ఏమియీతొందర. చక్కఁగా గుఱుతింపుము. సందడికిం గారణమేమి?

ల:—రామా, ఇంకను శాంతముగా మాటలాడుట న్యాయమా!

చ. పరుగిడుచున్నవారు భట♦వర్యులు తీక్ష్ణశరంబులూని భీ
కరగతి హస్తివర్యములు♦కాఱడవిం దగ నావరించి ని
ర్భరజవ మొప్పవచ్చెడి ఖు♦రధ్వని దిక్కుల నిండునట్లు స
త్తురగములట్టెచేరెడిని♦దోడనె వింట శరంబుఁ గూర్పుమీ. 18

రాము:—లక్ష్మణా! చక్కఁగాఁ బరీక్షించి చెప్పుము. త్వరపడి భరతుని దూషింపకుము.

ల:—రామా, రామా, పర్ణశాల వెడలిరమ్ము. సేనలు సమీపించుచున్నవి. అరణ్యము చీకాకుపఱచుచు గజహయములు వచ్చుచున్నవి.

రాము:—నాయనా! చెట్టు దిగిరమ్మా! సీత భయపడునేమో,

ల:—(వృక్షమునుఁడి గుమికి) రామా! శరాసనమును నేనును బూనెద.

రాము:—వత్సా! సీత భయపడకుండఁ జెంతనుండుము. అంతియ చాలు. భరతుఁడే వచ్చినఁ గోదండమేల? ఇతరులు మనపైనెత్తివచ్చిన నీవిందుఁడిన నేను గార్యము చక్కఁబెట్టెద (అనిశాంతిల్లఁజేయును)

(భరతుఁడు శత్రుఘ్నునితోఁ బర్ణశాలచెంతఁ బ్రవేశించును)

భర:—శత్రుఘ్నా! అదె పర్ణశాల యొకటియున్నట్లు తోఁచుచున్నది. అందే రామచంద్రుఁడుండునా. (దృష్టిసారించి) ముగ్గురు పర్ణశాలలో నున్నట్లున్నది. (ముందు నడచి) అదిగో రామచంద్రుఁడు సీతాలక్ష్మణులతోఁ గూరుచుండియున్నట్లున్నది. (మఱికొంత చెంతకుంబోయి) సోదరా! శత్రుఘ్నా! అదె రామచంద్రుఁడు కూరుచున్నవాఁడు చూచితివా. (కన్నీరునించి) అక్కటా!

సీ. రాజపీఠంబున ♦ రంజిల్లఁదగువాఁడు
వసుధపైఁ గూర్చున్న♦వాఁడు నేఁడు
రాజన్యసేవితుం♦డౌ జగత్పతి మృగ
వారంబులోనున్న♦వాఁడు నేఁడు

విమలాంబరంబులు ♦ వెలసెను నెకిమీఁదు
నారచీరలు గట్టె♦నాఁడు నేఁడు
మృదులశయ్యలపైన♦మేను చేర్చెను పతి
కఠినకుశాలఁ బరుండఁ♦గలిగె నేఁడు

తే. క్రమ్రసుమహారములఁ దాల్చు♦శిరము విభుండు
కఠినజటలను దాల్పంగఁ ♦ గలిగె నేఁడు
కటకటా! యేమిచెప్పుదు ♦ కాలమహిమ
మిన్నిటికి హేతువా కైక♦యేమొ మార. 19

శత్రుఘ్నా? చూడుమా రామచంద్రుని దురవస్థ.

చ. ధరణిఁబరుండ ఘూర్ణియు ని♦తాంతము గ్రమ్ముట నారచీరలుం
గరము వివర్ణతం బరఁగి♦కాంత శరీరరుచిన్ హరించెడున్
నిరుపమసత్ప్రభాకరుఁడు ♦ నీరజమిత్రసమాన తేజుఁడీ
ధరణివిభుండు దీనుని వి♦ధంబున నిందు వసించె నక్కటా!

ఇఁక ద్వారగాఁబోయి రామునిఁజూచి పలుకును. (పర్ణశాలసమీపించి వడివడిం బోయి యేడ్చుచు రాముని పాదములపైఁబడును. శత్రుఘ్నుఁడు నమస్కరించును.)

రాము:—(పరమానందముతో) నాయనా, భరతా! లేలెమ్ము.

భర:—(లేవకయే దుఃఖించుచుండును)

రాము:—వత్సా! ఏల విచారించెదవు. (అని లేవనెత్తి కౌఁగిలించి శిరంబు మూర్కొని) ప్రియసోదరా, ఈవేషమేమి? ఇటకేల వచ్చితివి? పురమునఁ దండ్రిగారు కుశలముగనున్నారా!

భర:—(కన్నీరు నుడుచుకొని) తమ రీవల వచ్చిననాఁడే రాత్రికిఁ గౌసల్యగృహమున మిగుల వగలఁబొగిలి సురపురిం జేరిరి.

రాము:—హా! దశరథమహీపాల శిరోమణీ! తండ్రీ! (అని మూర్ఛిల్లును లక్ష్మణుఁడు దుఃఖించును).

భర:—రామచంద్రా! (అని పిలిచి శీతలోపచారములచే సేదఁదేర్చి) తమరే యట్లు శోకించిన నావంటి వాని మాట చెప్పవలయునా,

రాము:—వత్సా! మనమిపుడు దిక్కులేని వారలమైతిమి. ఇఁక నేమియుత్సాహము గలుగఁగలదు? మనమేలు గోరువారెవరు?

(వసిష్ఠుఁడు ప్రవేశించును)

వసి:—శ్రీరామా! ఇది దుఃఖించుసమయము కాదు. త్వరగా నదికిం బోయి స్నానము

భర:—

మ. ధరణీభారముఁ దాల్చ రమ్ము పురికిం ♦ దాత్పర్య మేపారభూ
వరుఁ డేమేని వచింపలేదు వనిలో ♦ వాసంబు చేయంగ నీ
వరుగంబోలు నటంచు దుష్టమతి న్యా ♦ యంబుల్ విసర్జించి ని
ష్ఠురభంగిన్ వచియించె నాజనని యో ♦ క్షోణీశ ! యక్లాటచేన్. 21

క. జనకుని శాసనమును దీ
ర్చను జాలక పోయె నకట ! ♦ రాముం డని యే
మనుజుఁడు పల్కఁడు కావునఁ
జను దెమ్మా రామచంద్ర ! ♦ చయ్యనఁ బురికిన్. 22

వసి:—రామా, భరతుఁ డాడినపల్కు శాస్త్రసమ్మతము, కాన నతనికోర్కి నిదీర్చుట నీకు విధి. ప్రయాణముచేయుము.

రాము:—మహాత్మా: మీ రెఱుఁగని ధర్మములు లేవు. తమ్మునిరాజ్యము నేఁగొనుట చౌర్యముకదా. తండ్రియానతి లేదనుట ధర్మముగనున్నదియా. తల్లికి వరద్వయం బొసఁగలేదా. ఏలయిట్లు వాగ్బాణముల నన్ను నొప్పించెదరు ?

భర:—రామచంద్రా ! రాజ్యము నా దనుట కఠినోక్తి. శాస్త్రము లిమ్మాట నంగీకరింపవు. కనుకఁ జౌర్య మనుట సరిపడదు. దానిని నేఁబూనినఁ జౌర్యమగును. అట్లు కాదనుట సాహసము.

రాము:—వత్సా ! మన కిరువురకుఁ దండ్రియాజ్ఞయే శిరసావహింపఁ దగినది. దానిని మీఱి ప్రవర్తించునధికారము లేదు. కనుక వాక్కలహము మాని నీవు పదునాల్గు వర్షములు రాజ్యమును బాలింపుము.

కౌత్సముని:—రామవాక్యము చక్కఁగా నున్నది. తండ్రి కెఱుకపఱచి వ్రతముఁ బూనివచ్చి మరల వ్రతము జరపక పురిం జేరిన లోకాపవాదము గలుగకపోదు. "యథారాజా తథా ప్రజా" యన్నట్లు లోకులు సత్యము జరపఁబూనరు.

భర:—(తనలో) పిడుగువలె నీయన యెవరో వచ్చికూరుచున్నవాఁడే (ప్రకాశము) రేపు పట్టాభిషేకమని చెప్పిన తండ్రిపల్కులే యరణ్యముల పాలుకావలెనో.

వసి:—నిజము నిజము. భరతుఁ డన్నమాట సత్యమే. నే నెఱుఁగుదు రాముఁ డెఱుఁగఁడా. ఎల్ల రెఱుంగుదురు.

రాము:—మునివర్యా ! కాలోచితమగునట్లు మీ రేపల్కిన నేనేమనువాఁడ నార చీరలు ధరించునపుడు నాతండ్రి చూచుచుండలేదా. జానకిని నారచీరలు ధరింపుమని కైక చెప్పఁగా నాతండ్రి కోపమున

"సత్యరూపబంధురతరపాశబద్ధుఁడను" అని పల్కలేదా. దానియర్థమేమి? సంతోషమున నన్ను వీడ్కొలిపెనని నేననఁజాలను కాని నారాకకు విధిలేకయే యంగీకరించెను. దానిం దీర్చుట నాధర్మము నేనెట్లు మానఁజాలుదు?

క్షత్రముని:— అహా! రామవాక్యము ప్రశంసార్హము. శాస్త్రసమ్మతము

(ఆకాశమున ధ్వని)

తథాస్తు. తథాస్తు. తథాస్తు.

రాము:— అందఱు విన్నారుకదా. వనదేవత లదృశ్యరూపమునఁ బల్కుచున్నారు.

భర:— (క్రోధముతో)

చ. వనములనీవు జానకియు♦వాసము చేయుట నిశ్చయంబయే
వినుము భవత్పదాబ్జములు♦వేడుకఁగొల్చుచు లక్ష్మణుండు ని
ల్చినగతినేను నుండెదను♦ సిద్ధము నాపలు కిద్ది; యే నయో
ధ్యను గనఁజాలు రాజ్య మది♦యాప్తుల యేల్బడినుండఁగాఁ దగున్. 23

రాము:— వత్సా! అట్లనుటకు నీకధికారము లేదు. తండ్రియానతి శిరసావహించి చేయుటకే మన కధికారము గలదుగాని క్షత్రగా నాజ్ఞచేయుటకు దాని మార్చుటకు మనమెంతవారము?

క్షత్రముని:— ఔరా! రామునిచిత్తవృత్తి! శ్లాఘ్యము. శ్లాఘ్యము.

భర:—

చ. అనుజునికోర్కి దీర్చు టది♦యర్హము కాదొకొ నీకు రాజ్యముం
గొను మని యిచ్చువాఁడ నొక♦కొంకును బొందక రమ్ము పట్టనం
బున కటులైన నన్నియును♦బొందుగఁ దీర్చిన యట్టులౌనుగా;

రాము:—

వినుభరతా ప్రసంగ మిది♦వేయివిధంబుల నెంచిచూచితిన్. 24

వసి:— రామా! ఆచార్య మగు నన్నభియము పోయెఁగదా. ఇంకేల రాఁగూడదు? "ఇది ప్రసంగ" దను టేలొకో.

రాము:— భరతునకు రాజ్యమిచ్చు నధికార మెవ రిచ్చిరి? తండ్రియాజ్ఞ యేమని?

(ఆకాశమున ధ్వని)

(శ్రీరామ వాక్యముల మోఘములు. అవి యనుష్ఠేయములు. లోకు లీవిషయమును గ్రహించి ప్రవర్తింతురుగాక.)

రాము:— వింటిరా! వనదేవత లెట్లు సెలవిచ్చుచున్నారో.

భర:— రాజ్యపాలనమున నేనశక్తుఁడను, నా కదిపలదు,

రాము:—వత్సా! పట్టుపట్టిన నేనేమందును? ఒక్కమాట చెప్పెద. అది నాయాజ్ఞగా భావింపుము. నారాక నిరీక్షించుచు రాజ్యమును బాలించుచుండుము. పొమ్ము.

భర:—(ఏడ్చుచు) లోకాపవాదమునఁ గ్రహించి నేను జావవలయుననియా మీ తాత్పర్యము.

రాము:—(కన్నీరునించి చేరఁదీసికొని) నాయనా. రాజ్యము నాది, నేను దండ్రియాజ్ఞ నెఱవేర్చి వచ్చుదనుక నారాజ్యము నాకు బదులుగ నీవు పాలింపుము.

(ఆకాశమునుండి పుష్పవృష్టి గురియును. దివ్యపాదుకలు కుశసహితముగాఁ గ్రిందికిం దిగును.)

త్రోత్తముని:—(లేచి) ఎల్లరును జూచితిరి గదా యీవిచిత్రము. దేవత లీతరుణమున భరతుఁడు చేయఁదగిన కార్యము నాజ్ఞాపించిరి. ఈపాదుకల కభిషేకము చేసి రాజ్యభార మునిచి. తాను బాలించుచుండవలయుననికాదా భావము.

రాము:—సంతోషము. అట్లే జరగుఁగాక.

వసి:—వత్సా! భరతా. ఇఁక వాదించిలాభమేమి? భగవదుద్దేశ్య మిట్లున్నది. తప్పింప శక్యమా. రామరాజ్యము నీదివ్యపాదుకల పైనునిచి సేవచేయుచు నీవు పాలింపుము. లోకాపవాదము నీకుఁ గల్గదు.

రాము:—నాయనా. అట్లేచేయుము. లెమ్ము.

భర:—(కన్నీరు దుడుచుకొని రాముని పాదారవిందములకు దివ్యపాదుకలందొడుగును.)

రాము:—వత్సా! ఈపాదుకలఁ బరిగ్రహింపుము.

భర:—(పాదుకల శిరసావహించి)

క. ధన్యుఁడ నేనే ధన్యుఁడ
ధన్యుఁడ నిత్తరుణమందుఁ దలపోయఁగ నే
ధన్యుఁడ సద్గుణగణమూ
ర్ధన్యుని పాదుకలు చిక్కె దైవవశమునన్. 25

[1] ఇంతకన్న నాకేమి మేలుకావలెను.

వసి:—(పుణ్యోదకములు దెప్పించి యప్పుడు చేయఁదగునట్లభిషేకకృత్యము జరపును)

భర:—(ఆనందముతో)[1]

ఉ. రామునిరాజ్య మిద్ది రఘురామునిపాదుక లివ్వి వీనిపై
రాముని రాజ్యభారమును రాముని యాజ్ఞను నిల్పినాఁడ శ్రీ

1. కావ్యార్థోపసంహృతిచే నిది ఉపసంహారము.

రాముఁడె పాలకుండు రఘురాముఁడువచ్చెడుదాఁక రాజ్యముఁ
శ్రీమహిమాఢ్యపాదుకలు చెంత వసించుచు నేలఁ బూనితిన్. 26

(పుష్పవృష్టిగురియును)

(ఆనందముతో)

క. కృతకృత్యుఁడఁ గృతకృత్యుఁడ
హితమిది యని నాకు దైవమీపాదుకలన్
మతి నెన్ని యిచ్చెఁ గావునఁ
గృతకృత్యుఁడ నేనె కాక యింకెవ్వరిలన్. 27

(అనియాడును.)

వసి:—పరమేశ్వరానుగ్రహంబున నన్నికార్యములు నెఱవేఱినట్లే, ఐన నిట్లగుఁగాక.

1 తే. సస్యసంపూర్ణయగుఁ గాక సతము ధరణి
న్యాయముం బూనియే నరనాథు లవని
నేలుదురుగాక ప్రజలెల్ల హితపథముల
వఱలుచుందురు గాక శ్రీవరుని కరుణ. 28

(అందఱు నిష్క్రమింతురు)

2(ఇది నిర్వహణసంధి)

ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్తగీర్వాణాంధ్రకవితాప్రాభవకాశ్యపాన్వయప్రభవ శ్రీజనమంచి వంశాంబురాశికుముదినిమిత్రసుబ్రహ్మణ్యమనీషిపుత్ర తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయవిరచితం బగు విచిత్రపాదుకాపట్టాభిషేకనాటకమునందు సప్తమాంకము.

సర్వము సంపూర్ణము.

---

1 శుభశంసన మగుట నిది ప్రశస్తి.

2 ఫలప్రాప్తికార్యానుయుక్తంబుగా నిర్వహణసంధి మూఁడంకములయందుఁ జెప్పఁబడినది.



'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి—1920.